# శ్రీ శంకర భగవద్గీతా శాస్త్రము
## తత్త్వ పరిజ్ఞానము



వేదాంత గ్రంథమాల

భగవద్గీతాశాస్త్రము

భగవద్వాగమృత

మాంధ్రపద్యాత్మక

మానిగమాంతసార

మిది

దేవగుప్త సన్యాసిరాజు

వ్రాసె హరికృపన్.

# శుద్ధపత్రము.

—❧—

| పొరట. | బంతి. | తప్పు. | | ఒప్పు. |
|---|---|---|---|---|
| 16 | 3 | చిలికింప | ... | చివికింప |
| 21 | 5 | కలితంబు | ... | కలిలంబు |
| 23 | 2 | గొనవిడు, | ... | గొనలిడు |
| 27 | 1 | ఈజన్మములం | ... | ఈజన్మములం |
| 29 | 3 | సన్మార్గము | ... | మన్మార్గము |
| 30 | 17 | ప్రికృతికి | ... | స్వప్రకృతికి |
| 36 | 5 | నధర్మంబును | ... | నకర్మంబును |
| 42 | 11 | భూతాత్ము | ... | భూతాత్మ |
| 65 | 6 | మనికి | ... | మగిడి |
| 72 | 6 | సన్యాసి | | సన్యాస |
| 83 | 9 | ఆదిస్వరూప | ... | ఆదివ్యరూప |
| 85 | 16 | మడలె | ... | మడరె |
| 89 | 4 | నివాస | ... | నివాసా! |
| 92 | 3 | దీర్ఘదుఃఖ | ... | దీర్ణదుఃఖ |
| 95 | 3 | నిశ్చయింతు | ... | నిచ్ఛయింతు |
| 96 | 3 | పరముల | ... | పదముల |
| ,, | 24 | నసభిష్యంగ | ... | ననభిష్వంగ |
| 104 | 2 | తెప్పడుఁజెలంగు | ... | తెప్పదు చెలంగు |
| 120 | 4 | కసత్కృపా | ... | కనత్కృతా |
| 130 | 11 | వినుముఁ | ... | వినుము |
| 138 | 16 | చందము | ... | చంతము |
| 139 | 23 | త్రిగుణాతీత! | ... | త్రిగుణాతీత |
| ,, | 24 | కరణ | ... | కరణ! |
| 140 | 3 | నాశన! | ... | నాశన |



శ్రీ

# భగవద్గీతాశాస్త్రము.

## అవతారిక.






శ్రీరాజద్గుణసేవ్యమానమగు [illegible]నం
జెల్వొంది దుర్వారసం
సారాటోపదురాపతాపముల న
శ్శాంతంబు విశ్రాంతి సం
హారం గారణమై యపారకరుణా
పారీణమై యొప్పు నోం
కారబ్రహ్మము నాశ్రయింతు నెపుడుం
గైవల్యసంసిద్ధికిన్. 1

ఉ॥ శ్రీజగదేకరంగమునఁ • జేర్చిన పాత్రములై సమస్తధా
త్రీజనము ల్విచిత్రతర • రీతులచేఁ దనపంపు సేయఁగా
నీజగదాత్మ నాటకము • నెల్లపు డాడుచు సూత్రధారుఁడై

చ॥ జగములఁ బుట్టఁ జేయు పృథు • శక్తికి విద్యయుఁ గల్మి దానిఁ బో
వఁగఁ దగువ్యక్తికిన్ విలయ • వర్తనయుక్తికి శక్తిరక్తి నిం
పఁగ రజమంచు సత్త్వముద • మంబరుచున్ బొగడొందునట్టియా
త్రిగుణములన్ దలంచి విను • తించెద సంతతము న్మదాత్మలో.

ఉ॥ నాలుగు మోములం గనని • నల్వ ద్విబాహువు లున్న శ్రీహరిన్
ఫాలవిలోచనంబు గను • పట్టనిశంకరు బాదరాయణున్
శ్రీలఁ దనర్చు వేదముల • చిక్కెడలించి శుకుం దనూజుఁగా
నేలినభాగ్యశాలిఁ బర • మేశుని వ్యాసుని సన్నుతించెదన్. 4

క॥ భారతమను తైలముచేఁ
బూరించుచు జ్ఞానదీప • మును వెలయింపన్
ధారణి నారాయణు నవ
తారమ్మును గనినవ్యాసుఁ • దలఁచి నుతింతున్. 5

గీ॥ పట్టిమూఁగవాని • వాచాలునిగఁ జేయుఁ
బంగు దాటఁ జేయుఁ • బర్వతముల
నెవనికరుణ యామ • హేశుఁ జిదానందు
మాధవుని సదా న • మస్కరింతు. 6

చ॥ కరములఁ దోత్రవేత్రములు • గ్రాలుచు నుండఁగ జ్ఞానముద్ర భ
ద్రరుచిరమూర్తితో నిజర • థస్థితుఁ బార్థుఁ గృతార్థుఁ జేయఁగాఁ
గరుణను గీతలన్సుధ న • ఖండముగా సురిపించు కృష్ణునిన్
వరదుఁ బ్రపన్నకల్పభగ • వంతు ననంతుఁ దలంతు నెంతయున్.

ఉ॥ సన్నుతిఁ జేసి నన్నయను • సారెకు మోడ్చెదఁ గేలుదోయిఁ ది
క్కన్నకుఁ జేసెద న్నతిస • హస్రము లెప్పుడు భక్తియుక్తిఁ బో

తన్నకుఁ బెద్దనాదులగు • నాంధ్రకవీంద్రుల వర్తమానమం
దెన్నికఁగన్న సత్కవుల • నెంచి నుతించెద గౌరవంబునన్. 8

కం॥ విద్యార్థికల్ప మనఁగా
విద్యార్థులనెల్ల సకల • విద్యాధనసంప
ద్యుతులుగఁ జేసెడు కరు
ణోద్యన్మతి శేషసద్గు • రూత్తము నెంతున్. 9

సీ॥ సాత్వికసద్గుణ • సంపత్తిఁ గాంచిన
రామయోగీంద్రుఁడే • ప్రాజ్ఞతండ్రి
సతతసదోపవా • సవ్రతుల్ రామయ
వేంకనామాత్యులే • విబుధనుజు
లశాంతిసత్యవ్ర • తాఢ్యుఁడౌ వడ్డాది
మల్లయసచివుఁడే • మంత్రిమామ
పరమపతివ్రతా • చరణధురీణయౌ
వీరమసాధ్వియే • ధీరరామ

గీ॥ యులరు సన్న్యాసిరాజ మ • ల్లయసమాఖ్యు
లైన మే మేమహామహు • నాత్మభవుల
మచ్యుతాహ్వయుఁ డెవ్వాని • యనుఁగు మనుమఁ
డట్టి సుందరరామ మ • హాత్ము నెంతు. 10

గీ॥ ఘోరమైనట్టి సంసార • వారిరాశి
దాఁటఁ గోరెడు నరులు గీ • తాప్లవంబు
నాశ్రయించినచో ననా • యాసముగను
బారమును జేరి సౌఖ్యంబు • వడయఁ గలరు. 11

గీ॥ ఎల్లయుపనిషత్తు • లెన్నంగ గోవులా
క్షీరనందనుండు • పిదుకు మేటి
క్రీడి దూడ పాలు • గీతాసుధారస
మానువారు పండి • తార్థ్యులవని. 12

మ॥ భగవద్దివ్యపదారవిందము లెదన్ • భావించి యాంధ్రంబునన్
భగవద్గీతలు పద్యకావ్యముగఁ జె • ప్పంబూనితిన్ దోసముల్
మిగులం గల్గఁగవచ్చు మత్కవితఁగూ • ర్మిన్ సైచిమన్నించుచున్
దగుఁబ్రోత్సాహమొనర్పఁగావిబుధసం • తానంబుఁబ్రార్థించెదన్.





# భగవద్గీతా శాస్త్రము.

## ప్రథమాధ్యాయము.

క॥ అని ధృతరాష్ట్రుఁడు సంజయుఁ
గని యని సేయఁ జని యేమి ♦ గావించినవా
రని పాండవులును నావా
రును ధర్మక్షేత్ర మగు కు ♦ రుక్షేత్రమునన్. 1

గీ. అనిన సంజయుఁ డి ట్లను ♦ నతనితోడ
రాజు దుర్యోధనుఁడు మొగ్గ ♦ రముగ నున్న
పాండుతనయుల సైన్యంబుఁ ♦ బాఱఁ జూచి
గురునిసన్నిధి కేగి వా ♦ కొనియె నపుడు. 2

గీ॥ చూడు మాచార్య! నీదు శి ♦ ష్యుండు బుద్ధి
మంతుఁ డనఁదగు దుప్రదసం ♦ భవుని చేతఁ
బన్నఁబడినట్టిదియును గొ ♦ ప్పదియు నైన
పాండుపుత్రుల యీచమూ ♦ మండలంబు. 3

*క॥ అందున్ శూరులు రణమం
దుం దుల్యులు భీమనరుల ♦ తో బల్విలు కాం
డ్రిందఱును మహారథు లై
న్నఁదగు పాంచాల మత్స్య ♦ నరనాథవరుల్. 4

మ॥ పురుజిత్సాత్యకి కుంతిభోజులును శైబ్యుం డాయుధామన్యుఁడ
త్యుదు తేజోనిధి చేకితానుఁ డభిమ • న్యుం డుత్తమౌజక్షమా
వరుఁడు న్వీరుఁడు కాశిరాజు విలస • ద్బాహాబలుల్ ద్రౌపదీ
తరుణీసూనులు ధృష్టకేతుఁడు సము • ద్యద్విక్రమవిక్రముల్.

చ॥ అది యటులుండనిమ్ము మన • యందు విశిష్టుల సైన్యనాథులన్
విదితముగాఁగ నీకు విని • పించెద నీవును భీష్మకర్ణులున్
బదఁపడి సౌమదత్తియుభ • వత్సుతుఁడున్ గృపుఁడున్వికర్ణుఁడున్
గదనమునందు దుర్జయు ల • ఖండపరాక్రము లో ద్విజోత్తమా!

క॥ శూరులు పలువురు తక్కిన
వారలు బహుళాస్త్రశస్త్ర • పరికరవిభవో
దారులు తమ ప్రాణంబులు
పోర మదర్థముగ ధార • వోసెద రనఘా! 7

క॥ మనసైన్య మపర్యాప్తము
దనరఁగ భీష్మాభిరక్షి • తం బగుచుండం
గను బర్యాప్తం బమ్మిన
దనరఁగ భీమాభిరక్షి • తంబగుచుండన్. 8

క॥ కావున మీ రేర్పఱిచిన
తావులయఁ దెల్ల నిలిచి • తగ మొగ్గరపుం
ద్రోవల నెల్లరు భీష్మునిఁ
గావఁగ జతనమును జేయఁ • గాఁదగు నార్యా!. 9

చ॥ అనవుడు భీష్ముఁ డాతనికి • హర్ష మెసంగఁగ సింహనాదమున్
బొనరిచి శంఖమొత్తె నన • మోఘముగాఁ బణవానకాదిని
స్వనములు నిండ శ్వేతహయ • చారురథస్థితులైన కేశవా
ర్జునులును దివ్యశంఖములు • రోదసి భేదిల నొత్తి రత్తఱిన్. 10

చ॥ హరి తనపాంచజన్యమును • నర్జును డప్పుడు దేవదత్తము
ద్ధురగతి మ్రోఁగఁ జేయుటయుఁ • దోడనె పౌండ్రము భీమసేనుఁడ
య్యరిభయదంబనంతవిజ • యంబు యుధిష్ఠిరుఁ డుగ్రరోషవి
స్ఫురణమునన్ సుఘోషమణి • పుష్పకముల్ మొరయించి రా కవల్.

క॥ ఆరవము వినినతోడనె
పూరించిరి శంఖములను • భూరిబలుఁడు కా
శీరాజు ద్రుపదరాజకు
మారులు నల ద్రౌపదీకు • మారులుఁ గడిమిన్. 12

క॥ అపరాజితవిక్రములగు
ద్రుపదవిరాటులును నరసు • తుఁడు సాత్యకియున్
రిపుభీకరశంఖధ్వను
లపరిమితోత్సాహభరితు • లై యొనరింపన్. 13

గీ॥ అట్టి భయదనినద • మంతకంతకు హెచ్చి
భూనభోంతరాళ • ములను గప్పి
ధార్తరాష్ట్రహృదయ • దళనంబుఁ గావించె
దెసలు మాఱుమ్రోయ • నెసక మెసఁగ. 14

గీ॥ ఆయుధప్రయోగ • మారంభమాత్రజే
నగ్గుమంను యుద్ధ • మాచరింపఁ
గడఁగు ధార్తరాష్ట్ర • గణమును బరికించి
ధనువుఁ బూని యిట్టు • లనియె హరికి. 15

గీ॥ దుష్టబుద్ధియైన • దుర్యోధనునకును
బ్రియము కలుగ నాచ • రింపఁ గోరి
పోరొనర్ప వచ్చు • వారల నందఱఁ
జూడఁగోరుచున్న • వాఁడఁ గాన. 16

గీ॥ అచ్యుత! ముకుంద! రణరంగ • మందు నిలిచి
యుద్ధ మొనరింపవచ్చిన • యోధులందు
నెవరితోఁ బోరనగునొ నా • కెఱుకపడఁగ
నిలుపుము రథంబు నుభయసే • నలకు నడుమ. 17

గీ॥ ఇట్లనియె సంజయుఁడు హృషీ • కేశుతోడ
నటు గుడాకేశుఁ డోభార • తా! వచింప
గురుపితామహముఖధరా • వరులయెదుట
రథము నిడి పార్థ! చూడు కౌ • రవుల ననుడు. 18

క॥ కనుఁగొనె నప్పుడు పార్థుం
డనుజులఁ దనుజులను గురుల • నఖలసుహృదులన్
జనకులఁ దాతల సఖులన్
మనుమల మామలను మేన • మామల నందున్. 19

గీ॥ ఉభయసేనలందు • నున్న బాంధవులను
గన్నులారఁ జూచి • కనికరంబు
కరముఁ బెరుఁగఁ బలికెఁ • గౌంతేయుఁ డధికవి
షాదమగ్నమాన • సమున హరికి. 20

క॥ దుర మొనరించుతలంపున
నరుదెంచిన స్వజనములను • నాలోకింపన్
విరిసెడు నాయవయవములు
నురువడి నోరెండిపోవు • చున్నది కృష్ణా!. 21

క॥ ఒడలం గదిరెనుఁ గంపము
పొడమెఁ గగుర్పాటు హస్త • మున నుండక జా
రెనుగాండివంబు మేనును
గడుమండఁ దొడంగె నిలువఁ • గాఁ జాల నిఁకన్. 22

క॥ తిరిగెదు నట్లున్నది మది
పొరిఁ ద్రోఁచెదు దుర్నిమిత్త • ములు స్వజనములన్
దూరమునఁ బొరిగొనఁ గేశవ!
పొరయుంగాఁ జాల శ్రేయ • మును బరికింపన్. 23

క॥ స్వామీ! విజయముఁ గోరను
గామింపను రాజ్యమును సు • ఖంబులు రాజ్యం
బేమిటికి మనకు భోగము
లేమిటి కీ బ్రతుకు బ్రతుకు • టెల గోవిందా!. 24

శా॥ ఈరాజ్యంబును భోగముల్సుఖములిం • కెవ్వారికిం గాంతు మ
వ్వారాచార్యపితామహాశ్వశురసం • బంధుల్ గురుల్ భ్రాతలున్
గారాపు న్మనుమల్ సుతుల్ మఱిఁ • దు లెన్నందద్ధనప్రాణముల్
దూరంబై చన నిల్చినారు రణమం • దున్ దేవకీనందనా!. 25

క॥ నను వారు గొట్టినను త్రిభు
వనరాజ్యప్రాజ్యవైభ • వమునకు నే వా
రిని జంపఁ గోర నన సే
మనవలె నింక మధుసూద • నా! మహీకొఱకున్ 26

గీ॥ ధార్తరాష్ట్రులఁ దునుమ సం • తసము మనకు
నెట్లు కలుగు జనార్దన! • యిట్టియాత
తాయులగు వారి జంపినఁ • దప్పకుండ
మనలఁ బాపంబె యాశ్రయిం • చును గదయ్య!. 27

గీ॥ కాన ధార్తరాష్ట్ర • గణమును బాంధవ
సహితముగను మనము • చంపఁ దగదు

స్వజనముల వధించి ♦ సౌఖ్యవంతుల మెట్టు
లవుదు మింక మాధ ♦ వా! తలంపు. 28

క॥ ఇల లోభోపహతమన
స్కులకుఁ గులక్షయమువలనఁ ♦ జొప్పడు దోషం
బల మిత్రద్రోహముచేఁ
గలిగెడు పాపం బెఱుంగఁ ♦ గష్టంబయినన్. 29

క॥ కులనాశనంబువలనన్
గలిగెడు పాపంబులెస్స ♦ గాఁ గనుమనమే
తెలిసికొనకుండు టెట్లా
కలుషమునందుండి తొలఁగఁ ♦ గలుగు క్రమంబున్. 30

క॥ కులము నశింప సనాతన
కులధర్మములెల్లఁ గూలుఁ ♦ గూలఁగ ధర్మం
బలము నధర్మము కులమం
దలము నధర్మమునఁ జెడుదు ♦ రలకులలలనల్. 31

గీ॥ సతులు చెడిపోయినను వర్ణ ♦ సంకరమగు
సంకరము వంశమునకు వం ♦ శఘ్నులకును
నరకమిడు వారి పితరులె ♦ ల్లరును బడుదు
రిలను బిండోదకక్రియా ♦ హీనులగుచు. 32

చ॥ కులముల రూపుమాపు నల♦కూళల దోసములంటు శాశ్వతం
బులయిన జాతిధర్మములు♦పూజ్యములౌ కులధర్మముల్ సెడున్
దలఁపఁ దొలంగునట్టి కుల ♦ ధర్మములంగల మానవాళికిన్
గలుగుట నిశ్చయంబు నర♦కంబని విందుముగా జనార్దనా!. 33

గీ॥ కటకటా! రాజ్యసుఖలోభ ♦ కారణమున
స్వజనములనెల్లఁ జంప ని ♦ శ్చయ మొనర్చి
పాలువడితిమి ఘోరపా ♦ పం బొనర్ప
నహహా! యేమందు గోవింద! ♦ హరి! ముకుంద!. 34

గీ॥ అస్త్రపాణులైన ♦ యల ధార్తరాష్ట్రులు
శస్త్రరహితు మాఱు ♦ సలుపలేని
నన్నుఁ గలనఁ జంపి ♦ నను నాకు నదియుపో
క్షేమతరము దేవ ♦ కీతనూజ!. 35

గీ॥ అనుచు నర్జునుండు ♦ ఘనశోకసంవిగ్న
మానసమున సశర ♦ మైనధనువు
యుద్ధమందు విడచి ♦ యుభయసేనలమధ్యఁ
దేరిమీఁద నస్సి ♦ తెళ్ళి యుండె. 36

ఇది యుపనిషదర్థప్రతిపాదకంబును బ్రహ్మవిద్యాస్వరూపంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతలయందు నర్జునవిషాదప్రతిపాదకంబగు మొదటియధ్యాయము.





# భగవద్గీతా శాస్త్రము.



## ద్వితీయాధ్యాయము.

క॥ సంజయుఁ డిట్లనెఁ గనుఁగొన
లం జొబ్బిలు నశ్రుకణము • లం గృప మదిలోఁ
బుంజీభవింప నేడ్చు ధ
నంజయునిం గాంచి లేఁత • నవ్వాలయంగన్. 1

క॥ భగవంతుఁ డిట్టాలను నీ
కగునే విషమమున నర్జు • నా! యార్యులకుం
దగనిదియును నస్వర్గ్యం
బగు కశ్మల మపయశంబు • నాపాదింపన్. 2

సీ॥ పార్థ! క్లైబ్యము నందుట • పాడిగాదు
చూవె నీకుఁ బరంతప! • క్షుద్రమయిన
హృదయదౌర్బల్యమును వీడి • కదనమునకు
సిద్ధుఁడవు గమ్ము లెమ్ము నా • జిష్ణుఁ డనియె. 3

క॥ అరిసూదన! మధుసూదన!
గురుపూజాపాత్రులైన • గురుభీష్ముల సం
గరధరణిని నేకరణిని
శరములతోడ నెదిరించి • చలుపుదు రణమున్. 4

క॥ గురులను మహానుభావుల
హరియింపక కుడుచు తిరిపె ♦ మైనను మేలౌ
గురువరుల నర్థకాములఁ
బొరిఁగొని తిను సుధయు రక్త ♦ పుంగూడె యగున్. 5

గీ॥ ఏది మనకు మేలొ ♦ యెఱుఁగకున్నార మె
వ్వారిఁ జంపి బ్రతుకఁ ♦ గోర మట్టి
ధార్తరాష్ట్రు లెదుటఁ ♦ దగ నిల్చియున్నారు
గెలుతు మేమొ! వారె ♦ గెలుతురేమొ!. 6

గీ॥ వితతకార్పణ్యదోషోప ♦ హతగుణుండ
ధర్మసందేహచిత్తుండ ♦ దానఁ జేసి
శ్రేయమును నిశ్చయించి వ ♦ చింపఁ గోరు
శిష్యుని బ్రపన్ను నన్ను శా ♦ శింపుమయ్య!. 7

గీ॥ పృథివి నసపత్నరాజ్యస ♦ మృద్ధిఁ గనియు
దివిజసామ్రాజ్యపదముఁ జెం ♦ దియును నైన
మామకేంద్రియోచ్ఛోషణో ♦ ద్దామశోక
మపనయించెడు మార్గ మెయ్యదియొ యెఱుఁగ. 8

గీ॥ ఇట్టులను సంజయుఁడు హృషీ ♦ కేశుతోడ
నలపరంతపుఁ డనఁ బొగ ♦ డందినట్టి
యా గుడాకేశుఁ డింకఁ గ ♦ య్యంబు సేయ
నొల్ల గోవింద! యని యూర ♦ కుండె నంత. 9

గీ॥ ఉభయసేనల నడుమ ని ♦ ట్లురువిషాద
మందుచున్నట్టి యర్జును ♦ నట్టి చూచి
పరిహసించువిధంబున ♦ భరతముఖ్య!
యిట్లు వచియించె నాహృషీ ♦ కేశుఁ డపుడు. 10

క॥ భగవంతుఁ డనియె వగచితి
వగవఁదగనివారిఁగూర్చి ♦ పలికెదు ప్రాజ్ఞల్
మిగులఁగఁ బండితజనముల్
వగవ రిల గతాగతాసు ♦ లకుఁ గౌంతేయా!. 11

గీ॥ లేకయుంటిననుట ♦ లే దెన్నఁడైనను
లేకయుంటి ననుట ♦ లేదు నీకు
లేకయుండి రనుట ♦ లే దీ నృపాలురు
నింకఁ గూడనుండు ♦ మెల్లరమును. 12

గీ॥ వరుసఁ గౌమార యౌవన ♦ వార్ధకములు
దేహి కీ దేహమున నెట్లు ♦ తేజరిలును
యట్లె దేహాంతరప్రాప్తి ♦ యతిశయిల్లు
నందులకు బండితుండు మో ♦ హంబుఁ గనఁడు. 13

గీ॥ పంచతన్మాత్రలును స్పర్శ ♦ లెంచి చూడ
ధరణి శీతోష్ణసుఖదుఃఖ ♦ దములు తిరము
లవునె వచ్చెడుఁ బోయెడు ♦ నందువలన
వాని నెఱిఁగి సహింపంగ ♦ వలయుఁ బార్థ!. 14

క॥ సరిగా సుఖదుఃఖపరం
పర నెంచుచుఁ బురుషవర్య ♦ మాత్రాస్పర్శో
త్కరముల వ్యథఁ జెందని యా
పురుషుఁడె ధీరుండు మోక్ష ♦ మున కర్హుఁడగున్. 15

క॥ భావం బసత్తునకును న
భావము సత్తునకు లేదు ♦ పర్యవసానం
బీవిధి నీ రెండింటికి
దై వారుట గనిరి తత్త్వ♦దర్శులు పార్థా!. 16

గీ॥ దేనిచే నీ సమస్తం బ ♦ నూనముగను
వ్యాప్తమయ్యెను దాని నె ♦ ల్లప్పు డెఱుఁగు
మయ్య! యవినాశియంచును ♦ నవ్యయమగు
దానికి వినాశ మొనరింపఁ ♦ దగఁడొకండు. 17

గీ॥ అలశరీరి నిత్యుఁ ♦ డప్రమేయుఁ డనాశి
కలవు తచ్ఛరీర ♦ ములకు మాత్ర
మంతములు నటంచు ♦ నందురు భారత!
యది యెఱింగి యుద్ధ ♦ మాచరింపు. 18

గీ॥ పార్థ! యాతండు చంప డెఁ ♦ వ్వానినైనఁ
జంపఁబడ డేరిచేనైనఁ ♦ జంపు ననుచుఁ
జంపఁబడునంచు నెంచు న ♦ జ్ఞను లిరువురు
తత్వ మెఱుఁగనివారు య ♦ థార్థ మిదియ. 19

గీ॥ అతఁడు పుట్టఁడు గిట్టఁ డొ ♦ కప్పుడైన
నుండియును వెండియును నుండ ♦ కుండఁబోవఁ
డజుఁడు నిత్యుఁడు శాశ్వతుఁ ♦ డగు పురాణుఁ
డాత్మ నశియింప దెపుడు దే ♦ హము నశించు. 20

గీ॥ ఆత్మ నవినాశి నిత్యుఁడం ♦ చజుఁ డటంచు
నవ్యయుండంచు నెఱుఁగుచు ♦ న్నట్టి పురుషుఁ
డెట్టు లెవ్వానిఁ జంపించు ♦ నెవని నేని
నెట్లు చంపును బార్థ! యూ ♦ హింపుమయ్య. 21

క॥ మనుజుండు జీర్ణ చేలము
లను విడిచి నవాంబరంబు ♦ లను గైకొను చా
డ్పున దేహి జీర్ణ దేహము
లను బాయుచుఁ గ్రొత్త మేను ♦ లను ధరియించున్. 22

గీ॥ ఆత్మ ఛేదింపఁగాఁ జాల ♦ వాయుధములు
దానిని దహింపలేఁడు వై ♦ శ్వానరుండు
పూని చిలికింపనేర వం ♦ బువులు దాని
వాయువును దాని శోషింపఁ ♦ జేయలేఁడు. 23

క॥ ఇది యచ్ఛేద్య మదాహ్యం
బిది యక్లేద్యం బశోష్య ♦ మిది నిత్యం బీ
యది సర్వగతము నచలము
నిదియె సనాతనము స్థాణు ♦ విదియె కిరీటీ!. 24

క॥ ఇది యవికార్య మచింత్యం
బిది యవ్యక్తం బటంచు ♦ నీరితమగుటన్
మది దీని నెఱిఁగి శోకము
గదియింపకయుండు టొప్పు ♦ గద కౌంతేయా!. 25

గీ॥ నిత్యజాతమటంచును ♦ నిత్యమృతమ
టంచు నీయాత్మమును మది ♦ నెంచుచున్న
నో మహాబాహు నీవిట్టు ♦ లుల్లమందు
దానికై దుఃఖమందఁగఁ ♦ దగదు సుమ్ము. 26

గీ॥ జన్మ మెత్తినవానికిఁ ♦ జావు ధ్రువము
నిక్కము మృతుండు మరల జ ♦ న్మించుననుట
యట్టి యనివార్యమైన కా ♦ ర్యమ్మునందు
నేల యాలీలఁ జింతించె ♦ దీవు పార్థ!. 27

గీ॥ భూతముల కాది యవ్యక్త ♦ ముగఁ దలంపు
వాని మధ్యమమేకద ♦ వ్యక్తమిపుడు
వానినిధనంబు కూడ న ♦ వ్యక్తమరయ
నిందులకు నీవు వగవంగ ♦ నేల పార్థ!. 28

గీ॥ ఒక్కఁ డచ్చెరువుగఁ జూచు ♦ చుండు నతనిఁ
బలుకు వేఱొక్కఁ డాశ్చర్య ♦ వస్తువుగను
నన్యుఁ డాలించు నవ్వాని ♦ నద్భుతముగ
నెఱుఁగఁ డొకఁడైనఁ దత్త్వంబు ♦ నిట్లు వినియు. 29

గీ॥ సర్వభూతశరీరముల్ ♦ సంహరింపఁ
బడిన నందుండు నాత్మ యె ♦ న్నటికి నైన
సంహరింపంగఁ బడదు ని ♦ శ్చయము గానఁ
దగదు శోకింప భూతసం ♦ తానమునకు. 30

గీ॥ ఇదియుఁ గాక నీవు ♦ మదిని స్వధర్మంబుఁ
దలఁచి సంచలింపఁ ♦ దగదు సుమ్ము.
క్షత్రియులకు ధర్మ్య ♦ సంగరంబుకన్న
శ్రేయ మన్య మింక ధ ♦ రిత్రి లేదు. 31

క॥ ఆరయ వివృతస్వర్గ
ద్వారంబై యిట్టు లప్ర ♦ యత్నముగాఁ జే
కూరిన యుద్ధము సుఖులగు మ
హారాజుల కే లభించు ♦ నమలవిహారా! 32

గీ॥ ధర్మయుక్త మగుచుఁ ♦ దనరుచుండెడి యిట్టి
యుద్ధ మీ వొనర్ప ♦ కుంటివేని
దానఁ గీర్తియును స్వ ♦ ధర్మంబుఁ జెలువొ
రెసఁపు మఱియుఁ బాప ♦ మును బొందు నీవు. 33

క॥ స్థిరముగ నీకపకీర్తిని
జను లాపాదింతు రిమ్మున్న ♦ న [illegible]

ప్పురుషుని కపయశ మెన్నఁగ
మరణముకన్న నధికంబు ♦ మదిఁ దలపోయున్. 34

క॥ నిను గారవముగఁ జూచెడు
ఘనులు మహారథులు నీవు ♦ కదనంబునకుఁ
బెను వెఱపున వెన్నుఁదీసితి
వని చులకగఁ జూచుచుందు ♦ రమలవిచారా! 35

గీ॥ నీదు సామర్థ్యమెల్లను ♦ నీవిరోధి
జనులు నిందించుచును నవా ♦ చ్యములఁ బెక్కు
లాడుచుందు రనారత ♦ మవనియందు
నింతకంటెను దుఃఖ మిం ♦ కేది చెపుమ. 36

గీ॥ సంగరంబున నీల్గిన ♦ స్వర్గ మబ్బు
జేత వైన నఖండమ ♦ హీతలాధి
నేతవయ్యెదు కయ్యంబు ♦ సేఁత కిపుడు
లెమ్ము కృతనిశ్చయుండవు ♦ గమ్ము పార్థ! 37

గీ॥ సుఖము దుఃఖము సమముగాఁ ♦ జూచుకొంచు
లాభము నలాభమును నొక్క ♦ లాగు నెంచి
జయము నపజయమును నొక్క ♦ సరణిఁ దలఁచి
యని నొనర్పఁ గడంగు నీ ♦ కఘ మడంగు. 38

గీ॥ సాంఖ్యమందలి బుద్ధి వి ♦ స్తార మిపుడు
చెప్పఁబడె యోగపద్ధతి ♦ చే లభించు
బుద్ధి వినిపింతు సద్దానిఁ ♦ బూని వినినఁ
గర్మబంధంబు విడువంగఁ ♦ గలవు పార్థ! 39

గీ॥ మొనయ దొకకీడు ప్రారంభ • మునకు నిందుఁ
బ్రత్యవాయంబుఁ గానంగ • బడ దొకింత
దానిధర్మం బొకించుక • యైనఁగాని
పార్థ! రక్షించెడును మహా • భయమువలన. 40

క॥ వ్యవసాయాత్మకబుద్ధియె
వివరింపఁగ నొకటియగుచు • వెలసెడు నిట న
వ్యవసాయాత్మకబుద్ధులు
భువి బహుశాఖము లనంత • ములు కౌంతేయా! 41

సీ॥ అవిపశ్చితులు 'నాస్తి • యన్యం'బనెడువారు
స్వర్గపరు ల్వేద • వాదరతులు
కామాత్మకులు జన్మ • కర్మఫలంబులు
గలిగిన భోగభా • గ్యములకొఱకుఁ
గర్మవిశేషముల్ • గఱపెడువాక్కులఁ
బూవు పూచినరీతి • బోధసేయు
నవ్వాక్యములచేత • నపహృతచేతస్కు
లగుచు భోగాదుల • నందఁగోరు

గీ॥ పురుషులకుఁ గృషి చేసిన • బుద్ధి యెపుడు
గలుగఁబోదు సమాధిని • గాన నీవు
కామ్యకర్మంబులందు సం • గంబు మాని
నిశ్చయంబగు బుద్ధిని • నెఱపు పార్థ! 43

క॥ త్రైగుణ్యవిషయములు సు
మ్మాగమములు కమ్మ గుణగ • ణాతీతుఁడవున్

యోగక్షేమద్వంద్వ
త్యాగుండవు సత్వగతుండ ♦ వాత్మజ్ఞుఁడవున్. 43

గీ॥ బావివలనఁ గలుగు ♦ పల్లు ప్రయోజనములు
బహుళజలమయములఁ ♦ బడయనట్లు
లఖిలవేదనిగది ♦ తార్థముల్ సిద్ధించు
బ్రహ్మవేత్తయైన ♦ బ్రాహ్మణునకు. 44

గీ॥ కర్మమునసె నీకుఁ ♦ గల దధికారంబు
గాని ఫలములందుఁ ♦ గలుగ దెపుడు
కర్మఫలములకును ♦ గాకుము హేతువ
కర్మమందుఁ బ్రీతిఁ ♦ గాంచవలదు. 45

క॥ విను యోగము సమత యనం
బను సంగము విడచి యోగ ♦ సంస్థితిఁ గర్మం
బొనరింపు సిద్ధ్యసిద్ధుల
సనయము సమబుద్ధి వగుచు ♦ నమలవిచారా! 46

గీ॥ బుద్ధియోగంబునకు దూర ♦ ముగఁ దనర్చు
కర్మము నికృష్ట మెన్నంగఁ ♦ గడగి నిరత
మాశ్రయింపుము పరమార్థ ♦ మయినబుద్ధి
కృపణు లర్జున! ఫలము ల ♦ క్షించువారు. 47

గీ॥ బుద్ధియుక్తులు విడుతు రీ ♦ భువనమందు
సుకృత దుష్కృతములు రెండు ♦ సులభముగను
గాన యత్నింపుమయ్య యో ♦ గమున కీవు
కర్మములయందు యోగంబు ♦ కౌశలంబు. 48

గీ॥ బుద్ధియుక్తులైన ♦ భూరిమనీషులు
కర్మఫలములందుఁ ♦ గాంక్ష విడిచి
జన్మబంధములను ♦ జక్కఁగా విదళించి
పద మనామయంబుఁ ♦ బడయుచుందుర్. 49

గీ॥ మోహకలితంబు నెపుడు నీ ♦ బుద్ధి వాయు
నపుడె పూర్వంబునను విని ♦ నట్టిదాని
వినఁ గలుగుదాని నిర్వేద ♦ మును మనమునఁ
బొందఁ గలుగుదు వని తలం ♦ పుము కిరీటి! 50

క॥ శ్రుతివిప్రతిపన్న భవ
న్మతినిశ్చలమగుచుఁ దగ స ♦ మాధిని నచల
స్థితి నుండు నప్పుడె నీ
వతులితమగునట్టి యోగ ♦ మందెదు పార్థా! 51

క॥ అన నర్జునుఁ డనియె సమాధిన్
దనరు స్థితప్రజ్ఞులక్ష ♦ ణం బెది? యతఁ డే
మని పలుకు? నతం డెట్లుం
డును? నాతం డెట్లు నడచె ♦ డును? గోవిందా! 52

క॥ అనినఁ భగవంతుం డి
ట్లను మనమునఁ బొడముకోర్కు ♦ లన్ని విడుచుచున్
దనలోఁ దనచేఁ దనిసెడు
ఘనుఁడు స్థితప్రజ్ఞుఁడన జ ♦ గంబునఁ బరఁగున్. 53

గీ॥ పుడమి నిడుముల కడలని ♦ యెడఁదవాఁడు
సుఖములను విగతస్పృహఁ ♦ జూచువాఁడు

వెఱపు రాగంబు క్రోధంబు • వీడువాఁడు
నైన మౌని స్థితప్రజ్ఞుఁ • డనఁగఁ బరఁగు. 54

క॥ అభిమైత్రి యెందుఁ గానక
శుభాశుభము లప్పు డప్పుడు • చూపట్టినచో
నభినందింపక వగవక
ప్రజ్ఞ గను ఘనుప్రజ్ఞ సుస్థి • రంబై వెలయున్. 55

క॥ తామేటియంగములవలె
నేమేటి నిజేంద్రియముల • నెల్లను విషయ
గ్రామమునుండి మరల్చెను
యామహిమాధికుని ప్రజ్ఞ • యలరుఁ దిరంబై. 56

క॥ ధరణి నిరాహారులకున్
మరలెడు విషయములు శక్తి • మాత్రము దక్కన్
బరముఁ గనిన మహనీయుల
కరయఁగ రాగమును వీడు • నమలవిచారా! 57

క॥ అతులప్రయత్నమహిమా
న్వితుఁడగు పండితుని మనను • వెనుకకు లాగున్
మతి సంక్షోభ మొనర్చుచు
నతిబలవంతముగ నింద్రి • యంబులు పార్థా! 58

గీ॥ అట్టిసర్వేంద్రియముల జ • యంబుఁ గాంచి
యుక్తుఁడై మత్పరుండుగా • నుండవలయు;
నట్లు వశ్యములగునింద్రి • యముల మెలఁగు
నతనిప్రజ్ఞ ప్రతిష్ఠితం • బై వెలుంగు. 59

చ॥ అనయము మానవుండు విష • యంబులఁ జింతనసేయ వానిపైఁ
గొనవిడు సంగమందునఁ జి • గుర్చొనుఁగామము దానఁగ్రోధమం
దున నవివేక మాపయినిఁ • దోఁచెదు విస్మృతి దాన బుద్ధి నా
శనమగు బుద్ధినాశనవ • శంబునఁ దాఁ జెడిపోవు నర్జునా! 60

గీ॥ ఆత్మవశ్యములై ప్రియం • బప్రియంబు
వీడు నింద్రియములచేత • విషయసమితి
ననుభవించుచు వశ్యాత్ముఁ • డైనవాఁడు
పొందఁ గలుగుఁ బ్రసాదంబు • పురుషవర్య! 61

గీ॥ అల ప్రసాదభావ • మలవడు వానికిఁ
దొలఁగి చనును సర్వ • దుఃఖములును
శీఘ్రముగను బుద్ధి • స్థిరముగా నుండుఁ బ్ర
సన్నమానసునకు • సవ్యసాచి! 62

క॥ కలుగదు బుద్ధి యయుక్తుని
కలవడునె యయుక్తునకును • నలభావనయున్
గలుగునె శాంతియు భావము
గలుగనివానికి నశాంతుఁ • గదియునె సుఖముల్. 63

గీ॥ స్వేచ్ఛగా విహరించెడు • నింద్రియముల
వెంట నెవ్వాని మనసు దా • నంటి తిరుగు
నదియె యాతనిప్రజ్ఞను • నపహరించు
వార్థిఁ జరియించు నోడను • వాయువట్లు. 64

గీ॥ విషయములనుండి యింద్రియ • విసరములను
ద్రిప్పఁ గలిగిన యట్టి సు • ధీవరేణ్యు

ప్రజ్ఞయె ప్రతిష్ఠితంబంచుఁ • బ్రాజ్ఞులెల్ల
సన్నుతించుచు నుందురు • సవ్యసాచి! 65

గీ॥ సకలజీవుల కగు నిశా • సమయ మేదొ
జాగరణకాల మదియపో • సంయమికిని
బ్రాణిసంతతి మేల్కాంచు • పగటివేళ
పరముగను మౌని కది రాత్రి • పగిదిఁ దోఁచు. 66

సీ॥ పూర్ణముగ నిండి కదలక • పొదలునట్టి
వారిరాశిని జలములు • సేరునట్లు
కోర్కులెల్లనుఁ దనుఁ గూడి • కొనిన శాంతిఁ
గాంచు నాతండు గాంచఁడు • కామకామి. 67

క॥ కోరికల విడిచి నిర్మమ
కారత్వము నిస్పృహత్వ • గరిమము నిరహం
కారత్వముఁ గాంచిన యా
పూరుషవర్యుండె శాంతిఁ • బొందుఁ గిరీటీ! 68

గీ॥ పార్థ! యీచెప్పఁబడినది • బ్రహ్మనిష్ఠ
కనఁడు మోహంబు దీనిఁ బొం • దిననరుండు;
అంతకాలము నందైన • నందునుండి
బ్రహ్మనిర్వాణపదమును • బడయఁ గలఁడు. 69

ఇది శ్రీ బ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున సాంఖ్యయోగంబను ద్వితీయాధ్యాయము. 105

శ్రీ

# భగవద్గీతాశాస్త్రము.

## తృతీయాధ్యాయము.

క॥ నరుఁ డిట్టులనియె శ్రేయము
మురహార! కర్మంబుకన్న • బుద్ధియెయని దే
వరమతమగుచో నేటికిఁ
బురికొల్పెదు ఘోరకర్మ • మునకు న్నన్నన్? 1

గీ॥ కలఁతగా నుండునట్టి వా• క్యమున నాదు
బుద్ధి భ్రమియింపఁ జేసెదు • పోల్కి నుంటి
దేన శ్రేయంబు నన్నుఁ జెం • దెదును దాని
నొకటి నిశ్చయముగఁ జెప్పు • మోముకుంద! 2

గీ॥ అనుడు నర్జునుతో జనా • ర్దనుఁడు వలికె
జ్ఞానయోగంబుచేతను • సాంఖ్యులకును
గర్మయోగముచే యోగి • గణమునకును
ద్వివిధమని నిష్ఠ మున్నె నేఁ • దెలుపలేదె? 3

గీ॥ కర్మముల నాచరింపని • కతనఁ బురుషుఁ
డొందనేరఁడు నైష్కర్మ్య • మొప్పమీఱ
జ్ఞానసిద్ధిని గాంచంగఁ • జాలఁ డెపుడు
కర్మసన్న్యాసమువనె ని • క్కముగఁ బార్థ! 4

కం॥ ఎక్కర్మమేని జేయక
యొక్కం డొకనిముస మూర ♦ కుండఁడు జగతిన్
జిక్కి ప్రకృతిజగుణంబుల
నక్కర్మమొనర్చు నవశుఁ ♦ డై ప్రతినరుఁడున్. 5

కం॥ కరచరణాద్యవయవముల
నరికట్టి మనస్సుచేత ♦ నలవిషయములన్
స్మరియించు విమూఢాత్ముఁడు
ధర మిథ్యాచారుఁ డని క ♦ దా యెన్నఁబడున్. 6

గీ॥ నియతమతి నింద్రియంబుల ♦ నిగ్రహించి
సరవిఁ గర్మేంద్రియముల న ♦ సక్తుఁ డగుచుఁ
గర్మయోగం బొనర్చునా ♦ ఘనుని జూవె
యుత్తముఁ డటంచు బుధజను ♦ లెత్తు రెపుడు. 7

గీ॥ నియతకర్మములను ♦ నీ వొనరింపుము
కర్మ మెన్నమేల ♦ కర్మమునకుఁ
గర్మముల నొనర్పఁ ♦ గడఁగని నీకు ల
భ్యంబుగాదు దేహ ♦ యాత్రయయిన. 8

గీ॥ మహిని యజ్ఞార్థమైన క ♦ ర్మములకన్న
నన్యకర్మము లొనరించు ♦ నట్టిజనుఁడు
కర్మబంధనుఁడగు యజ్ఞ ♦ కర్మములను
ముక్తసంగుఁడవై యొన ♦ ర్పుము కిరీటి! 9

కం॥ మును యజ్ఞాన్వితులగు ప్రజ
లను జేసి విధాత ముఖము ♦ లనె యభివృద్ధిన్
గనుఁ డిష్టకామముల నది
కొనసాగఁగఁ జేయునది య ♦ గును మీ కనియెన్. 10

క॥ ఈజన్మములం ద్రిదశులఁ
బూజింపుఁడు వారు మిమ్ముఁ ♦ బోషితు రుభయు లీ
యోజను భావితు లగుటను
భాజను లయ్యెదరు పరమ ♦ పదమున కెన్నన్. 11

గీ॥ యజ్ఞములచేతఁ దనిసిన ♦ యమరవరులు
కరుణఁ దమకిచ్చు నిష్టభో ♦ గముల ననుభ
వించి యవి వారి కిడక భు ♦ జించి రేని
నట్టివారలు తస్కరు ♦ లనఁబడుదురు. 12

క॥ జన్నము లొనర్చి మిగిలిన
యన్నమును భుజించి యనఘు ♦ లగుదురు సుజనుల్
మిన్నక తమకై వండెను
చెన్నంటులు పాపముల భు ♦ జించెడువారల్. 13

క॥ అన్నముచే భూతము లగు
నన్నము పర్జన్యవలన ♦ నగు పర్జన్యో
త్పన్నము జన్నముచే నగు
జన్నము కర్మంబువలన ♦ సంజాత మగున్. 14

క॥ బ్రహ్మోద్భవంబు కర్మము
బ్రహ్మం బక్షరునివలనఁ ♦ బ్రభవిల్లుటచే
బ్రహ్మము సర్వగతం బా
బ్రహ్మము యజ్ఞమున సుస్థి ♦ రంబై తనరున్. 15

క॥ ఏవంవిధచక్రమునం
దేవాఁడు చరింపఁ డాతఁ ♦ డే పాపంపుం
జీవనుఁ డింద్రియలోలుఁడు
గావున నాతఁడు నిరర్థ ♦ కపు జీవియగున్. 16

క॥ ఎవ్వాఁ డాత్మరతుండో
ఎవ్వం డాత్మమునఁ దృప్తి • నెసఁగెడువాఁడో
ఎవ్వాఁడు సంతుష్టాత్ముఁడొ
యవ్వానికిఁ జేయుకార్య • మది లేదుగదా. 17

గీ॥ అతనికిఁ బ్రయోజనంబు లే • దాచరింప
నాచరింపమిఁ బ్రత్యవా • యంబు లేదు;
ఎల్లభూతములం దాశ్ర • యింపఁదగిన
యర్థమును లేదు వానికి • యవనియందు. 18

క॥ ఫలసంగవర్జితుఁడవై
సలుపుము కర్మముల నీవు • సతతము ధరణిన్
ఫలమును గోరక కర్మము
సలిపిన పురుషుండు పరము • సంపాదించున్. 19

క॥ జనకాదులకామ్యంబగు
ఘనకర్మము చేత సిద్ధిఁ • గాంచుటచే నీ
వును లోకసంగ్రహార్థం
బునకైనను పార్థ! కర్మ • ములఁ జేయనగున్. 20

క॥ ఉత్తముఁ డెయ్యది సేయును
యత్తెఱఁగున నది యొనర్తు • రందఱు నాతం
డెత్తిన ప్రమాణమే స
ర్వోత్తమ మని యనుసరింపు • చుందురు దానిన్. 21

గీ॥ నాకుఁ జేయఁదగిన • దేకర్మమును లేదు
ముజ్జగంబులందు • మున్ను పొందఁ
బడనిదై యిఁకేను • బడయఁగల్గినది లే
దైనఁ గర్మవర్తి • నై తనర్తు. 22

క॥ నిరత మతంద్రితమతినై
పరువడిఁ గర్మము లొనర్పఁ ♦ బాల్పడనేనిన్
నరులును సన్మార్గముచొ
ప్పరసికదా యనుసరింతు ♦ రన్ని తెఱఁగులన్. 23

గీ॥ కర్మములను నేను ♦ గావింపకున్నచోఁ
జెడును లోక మందు ♦ చేత వర్ణ
సంకరమును నేను ♦ సలిపినవాఁడనై
ప్రజల నెల్లఁ జెఱచు ♦ వాఁడ నగుదు. 24

క॥ ఏను మజ్ఞుఁడు సక్తుండై
యొనరుచుఁ గర్మముల నట్లు ♦ లొనరింపంగాఁ
జనుఁ బ్రాజ్ఞుఁ డసక్తుండై
యనవరతము లోకసంగ్ర ♦ హార్థము పార్థా! 25

గీ॥ కర్మసంగులగుచుఁ ♦ గ్రాలు నజ్ఞులకును
బుద్ధిభేద మెపుడు ♦ పుట్టకుండఁ
బ్రాజ్ఞు లాచరించు ♦ చాచరింపఁగఁ జేయ
వలయు సర్వకర్మ ♦ ములను బార్థ! 26

గీ॥ ప్రకృతిగుణములఁ దద్వికా ♦ రముల బలిమిఁ
బలుతెఱంగులఁ జేయంగఁ ♦ బడినయట్టి
కర్మములకెల్ల నేసకా ♦ కర్త నంచు
నిల నహంకారమూఢాత్ముఁ ♦ డెదఁ దలంచు. 27

క॥ గుణములు వర్తిలుచుండున్
గుణములయం దనుచుఁ దెలిసి ♦ కొని తత్త్వజ్ఞుల్
గుణకర్మవిభాగవిచ
క్షణులై సంసక్తి నందఁ ♦ జాలరు పార్థా! 28

గీ॥ ప్రకృతిగుణమూఢులైన య • ప్రాజ్ఞజనులు
కడఁగి గుణకర్మసంగులై • కార్యిలు చుందురి;
పూని సర్వజ్ఞులాయసం • పూర్ణమతుల
బుద్ధిని జలింపఁజేయఁగాఁ • బోలదెపుడు. 29

క॥ కర్మములనెల్ల నాయం
దర్మిలి నిడి తత్త్వబుద్ధి • నాసలు సడలన్
నిర్మమకారుఁడవై రణ
కర్మము సంతాప మెడలి • కావింపు మిఁకన్. 30

క॥ ఈనామతానుసారము
గా నెవ్వ రసూయలేక • కడువడి శ్రద్ధా
ధీనత నుందురు వారే
పూనిక వీడుదురు కర్మ • ముల బంధములన్. 31

క॥ ఈనామతం బసూయం
బూని యొనర్పని నరాధ • ముల నిల సర్వ
జ్ఞానవిమూఢులు నష్టులు
గా నవివేకులుగ నెఱుఁగ • గా నగుఁ బార్థా! 32

గీ॥ జ్ఞానవంతుఁడయ్యు • ప్రకృతికిఁ దగు
రీతి నడుచుచుండు • భూతగణము
ప్రకృతి ననుసరించుఁ • బరికింప నిగ్రహం
బేమి చేయఁగలదు • నృపకుమార! 33

క॥ క్షితి రాగద్వేషంబులు
ప్రతీంద్రియార్థములఁ గలవు • వానికి వశులా
టతినష్టమగుట రెంటిని
మతిమంతు లడంతురి తమకు • మూర్తు రటంచున్. 34

గీ॥ బాగుగా నొసర్చు ♦ పరధర్మమున కన్న
విగుణమయ్యు నాత్మ ♦ వృత్తి మేలు
నిధనమైన మేలు ♦ నిజధర్మకర్మమం
దన్యధర్మమునగు భ ♦ యావహంబు. 35

క॥ అన నరుఁ డను నేవిధమున
ననయము నరుఁ డిచ్ఛలేని ♦ యతఁడైనను భృ
త్యునివలె బలవంతముగా
నొనరుచు దురితముల ననఁ బ ♦ యోజాక్షుఁ డనున్. 36

గీ॥ అది రజోగుణసంభవ ♦ మైనకామ
మదియు క్రోధంబు మఱియు మ ♦ హాశనంబు
గానఁ బాపములకు మూల ♦ కారణంబు
దాని శత్రువుగా మదిఁ ♦ దలఁపు మిచట. 37

క॥ ధూమమున నగ్నిమసిచే
నాముకురము మావిచేత ♦ నలగర్భంబున్
దా మూవరింపఁబడుగతిఁ
గామముచే నిదియుఁ గప్పఁ ♦ గా బడుఁ బార్థా! 38

క॥ తనివి చననట్టి యనలం
బనఁజను నీకామరూప ♦ మగు శత్రువుచే
ననయము బ్రహ్మజ్ఞానుల
ఘనమగు జ్ఞానంబు గప్పఁ ♦ గాఁ బడుఁ బార్థా! 39

క॥ మనసింద్రియములు బుద్ధియు
మను నెలవులు కామమునకు ♦ మఱి వానిని జే
కొని జ్ఞానము లోఁ గొని దే
హిని గామము మోహపెట్టు ♦ నింద్రతనూజా! 40

క॥ కావున నింద్రియవిజయముఁ
గావింపుము తొలుతఁ బిదపఁ ♦ గడ తేర్పుము నీ
కావిజ్ఞానజ్ఞానమ
హావైరిని బాపరూప ♦ మగు కామంబున్. 41

గీ॥ పరము లింద్రియములు ♦ పర మింద్రియములకు
మనము బుద్ధి పరము ♦ మనముకన్న
బుద్ధికన్నఁ బరుఁడె పో ♦ పరమాత్మ యం డ
టంచుఁ బండితులు వ ♦ చించుచుందు్రి. 42

గీ॥ బుద్ధికన్నఁ బరుని ♦ బుద్ధిచే నెఱుఁగుచు
నాత్మచేత నాత్మ ♦ నచలముగను
జేసి గెలువుమీదు ♦ రాసదంబగు కామ
రూప శత్రువును గు ♦ రుప్రవీర! 43

ఇది బ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబునఁ గర్మయోగం బను తృతీయాధ్యాయము. 148





# భగవద్గీతా శాస్త్రము

## చతుర్థాధ్యాయము.

గీ॥ అవ్యయంబగు నీయోగ ♦ మంబుజాప్తు
నకును నేఁ దెల్ప నతని నం ♦ దనుఁడు మనువు
వినియె నాతనిచేత న ♦ మ్మనువువలన
నెఱిఁగె నిక్ష్వాకువంచు శ్రీ ♦ కృష్ణుఁ డనియె. 1

క॥ పౌరి రాజర్షు లిది పరం
పరగా నేర్చిరి కాల ♦ బాహుళ్యముచే
వరమగు నీయోగం బు
ర్వరలోన నశించెనో ప ♦ రంతప! వింటే. 2

క॥ హితుఁడవు మద్భక్తుఁడ వగు
కతమున నీ కేను జెప్పఁ గాఁ బూనితి నం
చితము పురాతన ముత్తమ
మతిగోప్యంబైన యోగ ♦ మది కౌంతేయా! 3

చ॥ అనవుడు శౌరి కిట్లనియె ♦ నర్జునుఁ డో మధుసూదనా! భవ
జ్జననముఁ జూడ నిప్పటిది ♦ సారసమిత్రుని జన్మ మా పురా
తనము విచిత్రమయ్యెడుఁ గ♦దా యెటులాది నీవు వానికిన్
గనికరమొప్పఁ జెప్పుమనఁ ♦ గా నతఁ డిట్లని యెం [illegible]. 4

క॥ నీకును నాకును గూడ న
నేకములగు జన్మములు స ♦ నియె నవియెల్లన్
నాకెఱుఁగ నగును వానిని
నీకెఱుఁగఁగ రాదు ధార ♦ ణీవరతనయా! 5

క॥ ఏ నజుఁడ నవ్యయాత్ముఁడ
నే నల భూతములకెల్ల ♦ నీశుఁడ నగుచున్
బూని స్వకీయప్రకృతిని
నే నవతారంబుఁ గాంతు ♦ నెపుడుఁ గిరీటీ!

క॥ ముప్పెపుడు ధర్మమున కగు
నప్పుడును నధర్మమునకు ♦ నభ్యుత్థానం
బుప్పతిలు నెప్పు డపుడును
దప్పక నే నవతరించె ♦ దను గౌంతేయా! 7

క॥ శిష్టుల రక్షించుటకున్
దుష్టజనప్రకరములను ♦ దునుమాడుటకున్
విష్టపముల ధర్మము సం
తుష్ట మతిన్నిలుపఁ బుట్టు ♦ దుఁ బ్రతియుగమునన్. 8

గీ॥ నాదుదివ్యావతారముల్ ♦ నాదుచెయువు
లెఱిఁగి కొలిచిన మహనీయు ♦ లీశరీర
మును ద్యజించి పునర్జన్మ ♦ మొనయకుందు
రమ్మహాత్ములు నాలోన ♦ నైక్యమంది. 9

గీ॥ విగతరాగభయక్రోధు ♦ లగుచు మత్స్వ
రూపులు మదాశ్రితులునై ని ♦ రూఢమయిన
జ్ఞానతపమునఁ బరిపూతు ♦ లైనవా ర
నేకు లందిరి మద్భావ ♦ మింద్రతనయ! 10

క॥ ఏరీతి నన్ను నెవ్వా
రారాధించెదరొ వారి ♦ నట్టుల నేనుం
గూరిమి ననుగ్రహింతును
వారును నాచొప్పువట్టి ♦ వర్తింతు రిలన్. 11

గీ॥ కర్మఫలసిద్ధి నిచ్చటఁ ♦ గాంచఁ గోరి
దేవతారాధన మొనర్పఁ ♦ దివురుచుంద్రు
మనుజలోకంబునందుఁ గ ♦ ర్మఫలసిద్ధి
శీఘ్రముగఁ బొందఁగల్గుటం ♦ జేసి పార్థ! 12

గీ॥ సృష్టిఁ జేసితి వర్ణచ ♦ తుష్టయంబు
నమరు గుణకర్మముల విభా ♦ గమునుబట్టి
యట్టిసృష్టికిఁ గర్తనై ♦ నట్టి నన్న
కర్తగా నవ్యయాత్ముని ♦ గా నెఱుంగు. 13

క॥ కర్మంబులు న న్నంటవు
కర్మఫలాపేక్ష నాకుఁ ♦ గలుగదు నాయీ
మర్మంబు నెఱుఁగు నాతఁడు
కర్మసమూహమునఁ గట్టఁ ♦ గాఁ బడఁ డనఘా! 14

క॥ దీని నెఱింగిన ప్రాక్త ను
లైన ముముక్షువులు చేసి ♦ రల కర్మములన్
గానం బూర్వులగతి ప్రా
చీనంబగు కర్మములనె ♦ చేయుము పార్థా! 15

క॥ కర్మం బెయ్యది? యెట్టియ
కర్మం? బని భ్రాంతిఁ గాంత్రు ♦ కవులును గానన్
గర్మమును దేటపఱుతున్
బేర్మి నెఱిఁగి యొలఁగెద వశుభ ♦ నిర్ముక్తుఁడవై. 16

గీ॥ కలదు తెలియంగఁ దగినది ♦ కర్మమునకుఁ
గలదు తెలియంగఁ గలది వి ♦ కర్మమున క
కర్మమునకును దెలియంగఁ ♦ గలది కలదు
కర్మతత్వంబుఁ దెలియ శ ♦ క్యంబు గాదు. 17

క॥ కర్మమున నధర్మంబును
గర్మ మకర్మమునఁ గనెడు ♦ ఘనుఁడు నరులలో
నిర్మలబుద్ధియు యోగియుఁ
గర్మములన్నియు నొనర్పఁ ♦ గలవాఁడు నగున్. 18

క॥ ఏని సకలకర్మంబులు
పూనవు సంకల్పకామ ♦ ముల నవ్వానిన్
జ్ఞానాగ్నిదగ్ధకర్ముని
గా నిజమగు పండితునిగ ♦ గణుతింతు బుధుల్. 19

క॥ చేసెడు చెయ్వులఫలముం
గాసపడని నిత్యతృప్తుఁ ♦ డాశ్రయరహితో
ద్భాసితమతి కర్మములం
జేసియు నొక్కించుకేని ♦ చేయనివాఁడే. 20

గీ॥ నిలిపి యాసలెల్ల ♦ నియమితచిత్తాత్ముఁ
డై సకలపరిగ్ర ♦ హముల విడిచి
నైజదేహరక్ష ♦ ణము నిమిత్తము కర్మ
ములను జేయునతఁడు ♦ పొందఁ డఘము. 21

క॥ తనిసి యదృచ్ఛాలబ్ధికి
మని నిర్ద్వంద్వుఁడును విగత ♦ మాత్సర్యుఁడు నై
కని సమతఁ గల్మి లేముల
నెనయఁడు బంధంబుఁ జేసె ♦ నేనియుఁ జెయ్వుల్. 22

క॥ గతసంగునికిన్ ముక్తుని
కతులితసుజ్ఞానవిలసి ♦ తాంచితమతికిన్
క్షితి యజ్ఞార్థమొనర్చెడు
నతనికి నశియించుఁ గర్మ ♦ మంతయుఁ బార్థా! 23

గీ॥ అర్పణంబు హవిస్సు బ్ర ♦ హ్మంబుచేత
బ్రహ్మవహ్నిని వేల్వంగఁ ♦ బడినహుతము
బ్రహ్మకర్మ సమాధిని ♦ బరగువాని
వలనఁ బొందెడు ఫలమును ♦ బ్రహ్మమె యగు. 24

క॥ కొందఱు యోగులు ఫలముల
నందఁగఁ జేసెదరు దైవ ♦ యజ్ఞము బ్రహ్మా
గ్నిం దగ హోమముఁ జేయుచు
నుందురు యజ్ఞంబుచేత ♦ నొకయజ్ఞంబున్. 25

క॥ కొందఱు శ్రోత్రాదీంద్రియ
బృందంబును సంయమాగ్ని ♦ వేల్చెద రింకం
గొందఱు శబ్దాదివిషయ
బృందంబుల నింద్రియాగ్ని ♦ వేల్తురు పార్థా! 26

గీ॥ మఱియు సర్వేంద్రియముల క ♦ ర్మములఁ బ్రాణ
కర్మములనెల్లఁ గొంద ఱు ♦ త్కలిక మెఱయ
వేల్చెదరు నూనె జ్ఞానదీ ♦ పితసమంచి
తాత్మసంయమయోగాగ్ని ♦ యందుఁ బార్థ! 27

క॥ ప్రాజ్ఞులు కొందఱు సుతపో
యజ్ఞులు మఱి కలరు ద్రవ్య ♦ యజ్ఞులు స్వాధ్యా
యజ్ఞానయజ్ఞు లిలలోఁ
దజ్ఞులు గొనియాడ సంశి ♦ తవ్రతులు యతుల్. 28

క॥ ప్రాణ మపానమునందున్
బ్రాణమున న్వేల్చెద ర ♦ పానముఁ గొందఱ్
ప్రాణాయామధురీణులు
ప్రాణాపానములగతుల ♦ బంధించు చొగిన్. 29

క॥ వరనియతాహారులు వే
ల్తురు ప్రాణములందు నేర్పు ♦ తోఁ బ్రాణములన్
ధరణిని యజ్ఞక్షాళిత
దురితులు యజ్ఞవిదు లా బు ♦ ధుల్ కౌంతేయా! 30

క॥ స్థిరమయిన బ్రహ్మమును గాం
తురు యజ్ఞవిశిష్టభోజ ♦ నులు జన్మములన్
ధర నొనరింపనివారికి
దొరక దిహం బనినఁ బరము ♦ దుర్లభమె కదా. 31

క॥ లలి బ్రహ్మముఖంబున నీ
పలికిన యజ్ఞములు తెలుపఁ ♦ బడియెను గర్మం
బులవలనఁ బొడమె నివి యని
తెలిసికొనిన ముక్తిఁ గనెదు ♦ ధీరవిచారా! 32

క॥ ధనసాధన మగుయజ్ఞం
బునకన్నను జ్ఞానయజ్ఞ ♦ మును మేలనఁగాఁ
జనునుగద యఖిలకర్మము
లనయము జ్ఞానమునఁ బరిస ♦ మాప్తిం జెందున్. 33

గీ॥ జ్ఞానులును దత్త్వదర్శను ♦ లైన ఘనులు
జ్ఞాన ముపదేశ మొనర్చింప ♦ దాని నీవు
జోతచేతఁ బరిప్రశ్న ♦ చేత సేవ
చేత నెఱుఁగఁగఁ దగు శేము ♦ షీసమేత! 34

క॥ నీ కాబ్రహ్మజ్ఞానము
చేకూరిన మోహ మేమి ♦ చెందవు భూతా
నీక మశేషం బాత్మను
నాకెవడిఁ బిదపఁ జూడ ♦ నగు నాయందున్. 35

గీ॥ పాపులందఱికన్నను ♦ బరమపాపుఁ
డవయి నీ వుండినను సర్వ ♦ మైన వృజిన
జలధి జ్ఞానప్లవంబున ♦ సులభముగను
దాటఁ గలిగెద వీవు పృ ♦ థాకుమార! 36

క॥ ఎండిన కట్టెల నీఱుగ
మండెడు నిం గల మొనర్చు ♦ మాడ్కిని జ్ఞానో
ద్దండాగ్ని కర్మసమితి న
ఖండముగా భస్మరాశి ♦ గా నొనరించున్. 37

క॥ జ్ఞానమువంటి పవిత్రం
బైన దరుదు యోగసిద్ధుఁ ♦ డగు నాతఁడు కా
లానుక్రమమునఁ బొందెడుఁ
దానే తనయందు దాని ♦ ధన్యవిచారా! 38

క॥ జ్ఞానాసక్తిని శ్రద్ధను
బూని జితేంద్రియతఁ బరగు ♦ పురుషుఁడు పొందం
గా నగు జ్ఞానము జ్ఞానికి
మానితచిత్తోపశాంతి ♦ మసలక కలుగున్. 39

క॥ చెడు జ్ఞానశ్రద్ధాహీ-
నుఁడు సంశయమానసుండు ♦ ను న్నందియ మం

చెడువాఁ డిహముం బరముం
బడయం డెన్నఁటికి సుఖము • వడయఁడు పార్థా! 40

క॥ ఘనయోగముచేతను సమ
సినకర్మము జ్ఞానమహిమ • చేతను గోల్పో
యిన సంశయములుగల దృఢ
మనస్కుఁ బంధింపలేవు • మహిఁ గర్మంబుల్. 41

క॥ జ్ఞానాసివలన నీయ
జ్ఞానోద్భవ మానసస్థ • సందేహములన్
బో నడచుచు యోగాను
ష్ఠానం బొనరింపు లెమ్ము • సమరంబునకున్. 42

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున జ్ఞానయోగమను చతుర్థాశ్వాసము. 190





# భగవద్గీతాశాస్త్రము.

పంచమాధ్యాయము.

గీ॥ కర్మసన్న్యాసమును వెండిఁ ♦ గర్మయోగ
మీవు సెప్పెద వీరెంట ♦ నెద్ది మేలో
ముఖ్యముగ నిశ్చయించి చె ♦ ప్పుము ముకుంద!
యనుడు నర్జునుతో జనా ♦ ర్దనుఁడు వలికె. 1

క॥ కర్మపరిత్యాగంబును
గర్మాచరణంబు ముక్తి ♦ కరములె యందున్
గర్మత్యాగముకన్నను
గర్మాచరణము దలంపఁ ♦ గ విశేషముకా. 2

గీ॥ ద్వేష మెద మాని కాంక్షల ♦ తెరవువోని
వాఁడె నిత్యసన్న్యాసి ని ♦ ర్ద్వంద్వుఁ డనఁగఁ
బొగడఁ దగువాఁడు దా సుఖం ♦ బుగను బంధ
మోక్షమును బొందఁగల సువి ♦ చక్షణుండు. 3

క॥ పలికెదరు సాంఖ్యయోగం
బులు వేఱని మూఢజనులు ♦ బుధులన రట్లా
ఫలమందు రెంట నొకఁ డే
న్వల నొప్పఁగ నాశ్రయించు ♦ వాఁడు కిరీటీ! 4

క॥ అలసాంఖ్యులు పొందంగల
స్థలమే యోగులును బొందఁ ♦ జాలెడు వార
ట్టులు కాన సాంఖ్యయోగం
బుల నొకఁడుగఁ జూచువాఁడె ♦ పో ప్రాజ్ఞుఁ డిలన్. 5

క॥ అంద నశక్యము యోగముఁ
జెందక సన్న్యాస మందు ♦ చే యోగంబున్
బొందిన మౌనులు బ్రహ్మము
నందఁ గలుఁగు వార లర్జు ♦ నా! శీఘ్రముగా. 6

గీ॥ యోగయుక్తుండు విజితేంద్రి ♦ యుండు నగుచు
నతివిశుద్ధాత్ముఁ డగుచు జి ♦ తాత్ముఁ డయిన
సర్వభూతాత్మ భూతాత్ముఁ ♦ డుర్విలోనఁ
గర్మముల నాచరించియుఁ ♦ గట్టువడఁడు. 7

మ॥ కనుచు న్వినుచును సంస్పృశించుచును నా
ఘ్రాణించుచు న్మెక్కుచున్
జనుచుం గూర్కుచు నూర్చుచుం బలుకుచు
న్వర్జించుచున్ బట్టుచున్
గనుల న్విప్పుచు మూయుచుం డింద్రియవితా
నం బింద్రియార్థంబులన్
జను నేఁ జేసిన దేదిలేదను మనీ
షన్ యోగి తత్త్వజ్ఞుఁడై. 8

గీ॥ బ్రహ్మమునఁ గర్మములు నిల్పి ♦ ఫలము విడిచి
చేయుచుండిన యాతండు ♦ తోయములను

నంటకుండెడు తామర ♦ పాకురీతిఁ
బాపముల నంటఁ డెప్పుడు ♦ పాండుపుత్ర! 9

క॥ ఫలముం గోరక యోగులు
సలిపెదరు శరీరమాన ♦ సంబుల బుద్ధిన్
జలియింపని యింద్రియములఁ
బలుకర్మం బాత్మశుద్ధి ♦ పాటిలునంచున్. 10

గీ॥ విడిచి కర్మఫలంబుల ♦ విపులనిష్ఠ
శాంతి దనరారు యుక్తుండు ♦ సవ్యసాచి!
కామములు రేప ♦ ఫలముల కాంక్షఁ జేసి
కట్టఁబడెడు నయుక్తుండు ♦ కర్మములను. 11

గీ॥ మనసుచేతను సర్వక ♦ ర్మములు విడిచి
తా నొనర్పక నొనరింప ♦ నానతీయ
కుండు వశి నవద్వారపు ♦ రోపమాన
దేహసీమను సుఖముగాఁ ♦ దేజరిల్లు. 12

క॥ జనములకును గర్తృత్వం
బును గర్మంబులును గర్మ ♦ ముల ఫలయోగం
బును బ్రభువు సృష్టి సేయఁడు
పొనరఁ బ్రవర్తిలు స్వభావ ♦ మునఁ గౌంతేయా! 13

క॥ కొనఁడు విభుఁ డెవనిపాపం
బును సుకృతమునైన జ్ఞాన ♦ మును నజ్ఞానం
బననరత మావరించుట
ఘనమోహమున న్మనుంగుఁ ♦ గద జంతుతతుల్. 14

క॥ ధర నాత్మజ్ఞానం బె
వ్వారి యజ్ఞానంబు నెల్లఁ • బరిమార్చెడు న
ప్పురుషుల జ్ఞానము సూర్యుని
కరణిం బరతత్త్వమును బ్ర • కాశ మొనర్చున్. 15

గీ॥ జ్ఞాననిర్ధూతకల్మషు • లైన ఘనులు
తత్పరబ్రహ్మబుద్ధిఁ ద • దాత్ములగుచుఁ
దత్పరత్వముఁ దన్నిష్ఠఁ • దనరి కాంతు
రపునరావృత్తి భరతవం • శాగ్రగణ్య! 16

క॥ జ్ఞానులు విద్యావినయ
శ్రీనిధియగు విప్రునిం గ • రిన్ ధేనువునున్
శ్వానంబును శ్వపచుని సరి
గా నీక్షించెదరు వారె • కా సమదర్శుల్. 17

క॥ సమచిత్తు లిహమునన్ స్వ
ర్గముఁ గెలుతురు బ్రహ్మ మరయఁ • గా దోషవిహీ
నమును సమ మందువలనన్
సమదర్శకు లెపుడు బ్రహ్మ • సంస్థితులనఘా! 18

క॥ స్థిరబుద్ధు లసమ్మూఢులు
ధర బ్రహ్మస్థితులు నెన్నఁ • దగు బ్రహ్మవిదుల్
దురపిల్ల రప్రియంబున
హరుసముఁ బ్రియమునకుఁ జెంద • రాత్మలఁ బార్థా! 19

గీ॥ బాహ్యవిషయంబులం దాత్మఁ • బారనీని
యాతఁ డాత్మసుఖంబును • నందు నతఁడు

బ్రహ్మయోగయుక్తాత్ముఁడై ♦ పడయుచుండు
నక్షయసుఖంబు భరతవంశాగ్రగణ్య! 20

క॥ ఆదియు నంతముఁ గలిగి వి
షాదము చేకూర్చు స్పర్శ ♦ జములగు సుఖముల్
గాదేని బుధులు వాని న
నాదరభావమునఁ గాంతు ♦ రా? కౌంతేయా! 21

క॥ కామక్రోధోద్ధత్యము
లీమేను విడువకమున్న ♦ యెతఁ డిట విడువన్
సామర్థ్యముఁ గాంచెడు నో
యామనుజుఁడు సుఖియు యుక్తుఁ ♦ డై యొప్పుఁగదా. 22

క॥ తనలోఁ దా సుఖయించుచుఁ
దనలోఁ దాఁ గ్రీడ చేసి ♦ తానే తనలో
నను వెల్గు బ్రహ్మముం జెం
దిన యోగికిఁ గల్గు బ్రహ్మ ♦ నిర్వాణంబున్. 23

క॥ హతపాపులు గతసంశయు
లతులితనియతాత్ము లవిర ♦ తాఖిలభూత
ప్రతతిహితాచరణమతుల్
క్షితి బ్రహ్మనంద మంది ♦ చెలగుదురు ఋషుల్. 24

క॥ గతకామక్రోధులకుఁ
యతులకు యతమతులకు విది ♦ తాత్ములకును సం
తతమును బ్రహ్మానంద
స్థితి యంతట నుండుననుట ♦ సిద్ధము పార్థా! 25

క॥ మెలకువ బాహ్యస్పర్శం
బుల బయలం జిమ్మి కన్ను ♦ బొమల నడుమఁ జూ
పుల నిలిపి నాసికలలో
పలి ప్రాణాపానములను ♦ బట్టుచు సమతన్. 26

క॥ మనమును బుద్ధీంద్రియముల
మునుకువ బంధించి క్రోధ ♦ మును భయమును గో
ర్కెని విడిచి మోక్షరతుఁడగు
మునియే ముక్తుఁడగు నిక్క ♦ ముగఁ గౌంతేయా! 27

క॥ నను యజ్ఞతపఃఫలముల
కును భోక్తగ సర్వలోక ♦ కోటులకు నధీ
శుని సర్వభూతముల సుహృ
దునిఁగాఁ దెలిసికొని చెందు ♦ దురు శాంతి నిలన్. 28

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసం
వాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబునఁ గర్మసన్న్యాసయోగ
మను పంచమాధ్యాయము. 218



శ్రీ

# భగవద్గీతా శాస్త్రము.

## షష్ఠాధ్యాయము.

క॥ ఫల మాశింపక కర్మము
సలిపెడు నతఁ డగును యోగి • సన్న్యాసియు న
గ్నులనుం గ్రియలును మానుట
వలనను గానేరఁ డంచు • భగవంతుఁ డనెన్. 1

క॥ ఎది సన్న్యాసంబని ప
ల్కుదు రది యోగమని తెలిసి • కొను సంకల్పం
బెద వదలక కానేరఁడు
గద యోగిగ ధర నొకాను • కంటును బార్థా! 2

గీ॥ అవని యోగారురుక్షుఁడై • నట్టి మునికిఁ
గర్మమును జెప్పుచుందురు • కారణముగ
నట్ల శమము యోగారూఢుఁ • డైనమునికి
సాధనంబని యందురు • సవ్యసాచి! 3

గీ॥ మహిని విషయంబులందుఁ గ • ర్మములయందు
నెప్పు డాసక్తి విడుచునో • యప్పుడగుచు
సర్వసంకల్పసన్న్యాసి • జనము లెన్న
నాఘనుండె యోగారూఢుఁ • డనఁగఁ బరగు. 4

క॥ తను నుద్ధరించుకొనఁదగుఁ
దనచేతనె తన్నుఁ గ్రిందఁ • దాఁ ద్రోసికొనం
జనదు తనకుఁ దా బంధువు
తనకుం దా శత్రు విది య • థార్థము పార్థా. 5

క॥ తనయాత్మ తనకు బంధువు
తనచేఁ దనయాత్మ నిర్జి • తంబగు నేనిన్
దనయాత్మ తనకు శత్రువు
తనచేఁ దనయాత్మ నిర్జి • తము కాకున్నన్. 6

క॥ పరమాత్మ సమాహితమై
పరగు జితాత్మునకు శాంత • పరిణతమతికిన్
సరి పూజాపరిభవముల
ధర శీతోష్ణసుఖదుఃఖ • దశలం దెపుడున్. 7

గీ॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్ముఁ • డైన ఘనుఁడు
తులితలోష్టాశ్మకాంచనుం • డల జితేంద్రి
యుండు కూటస్థుఁడై నట్టి • యోగివరుఁడు
యుక్తుఁడని చెప్పఁ బడుచుండు • నుర్విఁ బార్థ! 8

క॥ హితు లహితులు బంధుసుహృ
త్ప్రతతు లుదాసీనమధ్య • వర్తులు ద్వేష్యుల్
పతితులు సాధులు సములుగ
మతిఁ దలఁచెడు వాఁడు యోగి • మండనుఁ డనఘా! 9

క॥ ఏకాకియును నిరాశియు
నేకాంతస్థితుఁడు నియత • హృదయాత్ముఁడు దూ
రీకృతపరిగ్రహుఁడు నై
ప్రాకటముగ యోగి యాత్మ • బంధింపవలెన్. 10

క॥ పెనుమెరకయుఁ బల్లముఁ గా
నని శుచితలమునఁ గుశాజి ◆ నంబులపైఁ జే
లను గలిగిన స్థిరమగునా
సనమును నిర్మించి తనకు ◆ స్థైర్యమెలర్పన్. 11

గీ॥ ఆసుఖాసనమందు నే ◆ కాగ్రముగను
మనసు నెలకొల్పి వినియత ◆ మానసేంద్రి
యక్రియుండయి యోగమ ◆ భ్యాసమును నొ
నర్పఁ దగుఁ జిత్తశుద్ధికి ◆ నారతంబు. 12

మ॥ తనువు న్మస్తము కంఠము న్సమతఁ జెం◆ద న్నిల్పి స్థైర్యంబు చే
కొని నాసాగ్రమునందుఁ జూడ్కులిడి ది◆క్కుల్సూడకాత్మం బ్రశాం
తి నిరూపించి మనంబుఁ ద్రిప్పి గతభీ ◆ తిన్ బ్రహ్మచారివ్రతం
బున మచ్చిత్తుఁడు మత్పరుండగుచు నె◆ప్డున్ యుక్తుఁ డుండందగున్.

గీ॥ ఇట్టి నియతమనస్కుఁడై ◆ పట్టియోగి
యాత్మసంధానగరిమ నా ◆ యందునున్న
దాని నిర్వాణపర్యవ ◆ సానమయిన
దాని శాంతినిఁ బొందు న ◆ దారచరిత! 14

క॥ అతిభోజననిరతునకుఁ
క్షితి భోజనరహితునకును ◆ గేవలనిద్రా
న్వితునకు నిద్రాహీనున
కతిదుర్లభ మిట్టియోగ ◆ మర్జున! వింటే. 15

క॥ యుక్తాహారవిహారుఁడు
యుక్తస్వప్నావబోధుఁ ◆ డురుకర్మములన్
యుక్తముగఁ జేయునాతఁడు
యుక్తుఁడు దుఃఖహరమైన ◆ యోగమొనర్పన్. 16

క॥ ఎప్పుడు నియమితచిత్తము
చొప్పడి యాత్మమున నిలిచి • సుస్థితిఁ గనుచు
న్నప్పుడె కోర్కుల నెల్లం
ద్రిప్పిన యుక్తుఁడని ప్రస్తు • తింతురు పార్థా! 17
గీ॥ గాలి లేనిచోటఁ • గదలకుండెడు దివ్వె
నుపమగా వచించు • చుందు్రు బుధులు
యోగమాచరించు • యోగియౌ యతచిత్తుఁ
డైనవానియాత్మ • కార్యవినుత! 18
సీ॥ యోగసేవానిరు • ద్ధోత్తమచిత్తంబు
దేనియం దుపరతిఁ • దేలుచుండు
నాత్మచే నాత్మను • నవలోకన మొనర్చి
యాత్మయం దెందుఁ దా • హర్షమందు
నేది యతీంద్రియ • మిద్ధబుద్ధిగ్రాహ్య
మాయతి సౌఖ్యమెం • దనుభవించు
నెందునున్నట్టి యో • గీశుండు తత్స్వరూ
పమునుండి మరలఁ డె • ప్పటికి నైన
గీ॥ నెయ్యది లభింపఁ బెఱలాభ • మెద్దియైన
దాని కధికంబటంచుఁ దాఁ • దలఁపలేఁడో
యెందునున్నట్టివాఁడు తా • నెట్టిఘోర
దుఃఖములచేఁ జలింపక • తూలకుండు. 19
గీ॥ ఉర్వి దుఃఖసంయోగ వి • యోగమనెడు
పేరుఁగలయోగ మదియ ని • ర్విణ్ణచిత్తుఁ
డగు మహాత్మునిచే నిశ్చ • యంబు మీఱ
నాచరింపంగఁ బడవలె • నయ్య, పార్థ! 20

శా॥ సంకల్పంబునఁ బుట్టుకోర్కుల నశే • షంబు న్విసర్జించుచున్
బొంకం బారెడు నింద్రియాదుల మదిన్ • బోనీక బంధించుచున్
బింకం బూని మనంబు నాత్మమున దీ • పింపంగ బుద్ధిన్ విని
శ్శంక న్మెల్లనఁ జింతలెల్ల వదలన్ • శాంతిం దనర్పం దగున్. 21

క॥ మనసతిచంచల మస్థిర
మనయము విషయముల మెలఁగు • నవ్విషయములన్
జనకుండఁ బట్టి నిలుపఁ
జను నాత్మమునందుఁ దనవ • శంబున నుండన్. 22

క॥ శాంతాత్ముని శాంతరజ
స్స్వాంతుని బ్రహ్మమయుఁ గల్మ • షచ్యుతః యోగిన్
వంతున వచ్చి వరించు ని
తాంతసుఖం బెన్న నిది య • థార్థము పార్థా! 23

క॥ ఈగతి నిరతము నాత్మ ని
యోగించి నిరస్తకల్మ • షౌఘుండగు నా
యోగి పరబ్రహ్మశ్రీ
యోగసుఖము సులభరీతి • నొందుఁ గిరీటీ! 24

గీ॥ అంతట సమానబుద్ధి చె • న్నారు నతఁడు
యోగయుక్తాత్ముఁడును గాంచు • చుండు నెపుడు
సర్వభూతస్థుఁగాఁ దన్ను • సర్వభూత
సమితి తనయందు నెలకొన్న • చందమునను. 25

క॥ సకలమునందు న్నన్నున్
సకలము నాయందుఁ జూచు • సత్తముఁడగు వా
నికి నేఁ గనఁబడకుండుదు
నె కనంబడ కాతఁడుండు • నే నా కనఘా! 26

క॥ భూతస్థితుఁడగు నను న
ద్వైతుండై కొలుచు యోగి ♦ తల్లజుఁ డిల నే
భాతిఁ బ్రవర్తిలుచుండిన
నాతఁడు నాయందె యుండు ♦ నతఁడు కిరీటీ! 27

క॥ ఇతరుల సుఖదుఃఖములను
సతతము తనవానివలె వి ♦ చారించెడు మా
నిత యోగియె సర్వోత్తముఁ
డతిధన్యుం డని మదాశ ♦ యము కౌంతేయా! 28

క॥ సమతన్ సిద్ధించెడు యో
గము వాకొనఁబడియెఁగాని ♦ కన కున్నా న
స్థిమితమతి తత్స్థిరస్థితిఁ
గమలాక్షా! యుంచుఁ బలికెఁ ♦ గవ్వడి హరితో. 29

క॥ చంచలమతి బలవంతం
బెంచఁ బ్రమాథియును దృఢము ♦ నీమనసు నిరో
ధించుట దుష్కరమంచుఁ ద
లంచెదఁ బెనుగాలిలాగు ♦ లాగు ముకుందా! 30

క॥ మన సస్థిరము న జేయం
బనుమాట యథార్థమయిన ♦ నభ్యాసవశం
బున వైరాగ్యంబున దా
ని నిరోధింపంగవలెన ♦ నెన్ హరి నసుతో. 31

క॥ మనసు జయింపక యోగము
కొనసాగదు నిర్జితాత్మ ♦ కులు జతనములం
బొనరిచి తగినయుపాయము
లను బొందఁగవచ్చునని త ♦ లంచెదఁ బార్థా! 32

గీ॥ అయతియై శ్రద్ధమాత్రమే • యమరువాఁడు
యోగవిచలితచిత్తుండు • యోగసిద్ధిఁ
గాంచకుండిన వానికే • గతి లభించుఁ
గృష్ణ! వినిపింపవేయని • క్రీడి వలికె. 33

గీ॥ అప్రతిష్ఠుండు బ్రహ్మమా • ర్గాతిమూఢుఁ
డుభయవిభ్రష్టుఁడై చెడ • కుండు నొకొ—
యవని విచ్ఛిన్నమగు వలా • హకమువోలెఁ
గృష్ణ! కేశవ! శౌరి! హ • రీ! ముకుంద! 34

క॥ నాసంశయంబు పూర్ణము
గా సమసెడునట్లు చేయఁ • గాఁ దగు దీవే
యీసందేహనివృత్తిఁ
జేసెడు వేఱొకఁడు దొరకు • నే నీకన్నన్. 35

క॥ నావుడు భగవంతుండను
నావహిలదు నష్ట మిచట • నతనికిఁ బరముం
బోవదు దుర్గతి గలుగునె
వావిరి సుకృతము నొనర్చు • వానికిఁ దండ్రీ! 36

క॥ కని పుణ్యలోకముల నెల
కొని యోగభ్రష్టు లచట • గురుకాలం బా
వెనుకను శుచియగు శ్రీమం
తుని గేహమునందుఁ బుట్టు • దురు కౌంతేయా! 37

క॥ అదిగాక యున్న ధీమ
త్సదమలయోగిజనవంశ • సంభవమును గాం
చెద రీలోకములోఁ ద
త్సదృశభవము దుర్లభంబు • చర్చింపంగన్. 38

క॥ అందుం గ్రిందటి జన్మము
నందలి బుద్ధిప్రసక్తి • యలవడుకతనం
బొందుగఁ దత్సంసిద్ధిన్
బొందఁగ నాతఁడు విశేష • ముగ యత్నించున్. 39

క॥ పరవశుఁడైనను నాతఁడు
పురికొల్పం బడెడుఁ గాదె • పూర్వాభ్యాస
స్ఫురణన్ యోగాభ్యాసుఁడు
వరశబ్దబ్రహ్మమును ధృ • వంబుగ దాటున్. 40

క॥ సతతము యోగీంద్రుఁడు తన
జతనముల ననేకజన్మ • సంసిద్ధిఁ బరి
చ్యుతకల్మషుఁడై యుత్తమ
గతిఁ బడపంగాంచు రూఢి • గాఁ గౌంతేయా! 41

సీ॥ అధికుఁడగు యోగి తాపసు • లందఱకును
అధికుఁడగు యోగి జ్ఞానుల • కందఱకును
అధికుఁడగు యోగి కర్మఠు • లందఱకును
గాన నీవును యోగివి • కమ్ము పార్థ! 42

గీ॥ యోగులందఱిలో నెవ్వఁ • డుల్ల మెపుడు
నాయధీనముగా శ్రద్ధ • నను భజించు
నాతఁడే యుక్తతముఁడని • నాతలంపు
భవ్యసద్గుణసముదాయ! • పాండవేయ! 43

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున నాత్మసంయమయోగంబను షష్ఠాధ్యాయము. 261

శ్రీ

# భగవద్గీతా శాస్త్రము.

## సప్తమాధ్యాయము.

మ॥ హరివల్కెం బురుహూతనందనునితో • నాసక్తిచిత్తంబునం
గరమొప్పారఁగ నాపయిన్నిలిపి యో•గంబూని సన్నెప్పుడున్
శరణంబంది యసంశయుండ వగుచున్ • సంపూర్ణ రీతి న్నిరం
తరమున్నన్ను నెఱుంగుమార్గమును బా•ర్థా! భక్తి నాలింపుమా.

క॥ నే నీకుఁ జెప్పెదను వి
జ్ఞానసమాయుక్తమైన • జ్ఞానం బీ వ
ద్దాని సశేష మెఱింగినఁ
గానవు వేఱొండు తెలియఁ • గాఁ దగు దానిన్. 2

గీ॥ మానవసహస్రములలో నొ • కానొకండు
సిద్ధికొఱకై ప్రయత్నముల్ • సేయుచుండు
యత్నము లొనర్చు సిద్ధుల • యం దొకానొ
కండు నన్ను యథార్థము • గా నెఱుంగు. 3

గీ॥ పుడమి నీళ్లగ్నియును వాయు • వును నభంబు
మనము బుద్ధి యహంకార • మును ననంగ
వెలయుచుండును నెనిమిది • విధములుగను
నాదు ప్రకృతి త్రిలోకాధి • నాథతనయ! 4

క॥ ఇదియపర దీనికన్నను
బొదలెడు వేఱొకటి జీవ ♦ భూతము మేలై
నది నాదు ప్రకృతి దానం
గన తాల్పంబడెడు నిజ్జ ♦ గంబు కిరీటీ! 5

క॥ ఈ రెండు ప్రకృతులే కద
కారణములు సర్వభూత ♦ గణములకే నే
కారణము జగద్భవ సం
హారముల కటంచు నెఱుఁగు ♦ మా కౌంతేయా! 6

గీ॥ పరతరం బెన్న నాకన్న ♦ భరతముఖ్య!
వేఱొకటి లేదు తలపోయ ♦ విశ్వమందు
విశ్వమంతయు నాయందు ♦ వెలయుచుండు
సూత్రమునఁ గుచ్చఁబడు మణి ♦ స్తోమమట్లు. 7

క॥ నీరముల రసము ప్రభ శశి
సూరులలోఁ బ్రణవమెల్ల ♦ శ్రుతులన్ శబ్దం
బారోదసి నరులందున్
బౌరుష మే నగుదు చూవె ♦ పాండుకుమారా! 8

గీ॥ భూమియందునున్న ♦ పుణ్యగంధము విభా
వసునిలోన నెసక ♦ మెసఁగు తేజ
మఖిలభూతసమితి ♦ నలరారు జీవన
మలతపస్సు తపసు ♦ లందు నేన. 9

సీ॥ నిఖిలభూతములకు ♦ నిత్యబీజము గాఁగ
ననునెఱుంగుము గొంతి ♦ యనుఁగుఁగుఱ్ఱ!
బుద్ధిమంతులబుద్ధి ♦ భూరితేజస్వుల
తేజంబ నేనని ♦ తెలిసికొనుము

బలవంతులైనవా ♦ రల కామరాగవ
ర్జితబలం బేనని ♦ మతి గణింపు
ధర్మంబునకు విరు ♦ ద్ధముకాని కామంబు
భూతంబులం దేన ♦ పో కిరీటి!

గీ॥ సాత్వికపు రాజసపు తామ ♦ సంపుభావ
ములు గలుగువాని నెఱుఁగు నా ♦ వలనఁ గలిగె
నంచు నైనను నే వాని ♦ యందు లేను
గలవు నాయందు నవి శత ♦ క్రతుతనూజ! 10

గీ॥ త్రిగుణమయభావములచేత ♦ జగతియెల్ల
మోహితంబై గుణత్రయం ♦ బునకుఁ బరుఁడు
నవ్యయుఁడునైన నన్ దెలి ♦ యంగ లేదు
భవ్యసద్గుణ సముదాయ! ♦ పాండవేయ! 11

క॥ విను దైవియు గుణమయమై
తనరెడు నామాయ తరమె ♦ తరియింపంగా
నను శరణం బందిన యా
ఘను లమ్మాయను దరింపఁ ♦ గలరు కిరీటీ! 12

క॥ అవివేకులు మాయాపహృ
తవివేకజ్ఞాను లసుర ♦ ధర్మాశ్రితులున్
భువిఁ బాపకర్ములగు మా
నవాధములు పొందలేరు ♦ నను శరణంబున్. 13

గీ॥ ఆర్తులంచును జిజ్ఞాసు ♦ లంచు మఱియు
జగతి నర్థార్థులంచును ♦ జ్ఞానులంచు
నాల్గుతెరఁగులు గాఁగఁ ద ♦ నర్చు సుకృతు
లెంతయును నన్ను భజియింతు ♦ రిద్ధచరిత! 14

గీ॥ వారిలో నిత్యయుక్తుఁ డేక • భక్తియుక్తుఁ
డైన జ్ఞానియె శ్రేష్ఠుండు • నా నెనంగు
జ్ఞానియగువాని కెంతయు • నేను బ్రియుఁడ
నతఁడు పరమప్రియుండు నా • కనఘచరిత! 15

క॥ ఏరెల్ల వా రుదారులె
యారయ జ్ఞానియన నాత్మ • మని నామత మా
ధీరుఁడు యుక్తాత్ముండై
చేరెడు నుత్కృష్టగతిని • జేపట్టి ననున్. 16

గీ॥ బహుభవంబులతుద జ్ఞాన • వంతుఁ డగుచు
వాసుదేవుండె మమ్మ స • ర్వం బటంచు
నను భజించు మహాత్ముఁ డె • వ్వంగ జగము
నందుఁ గడుదుర్లభుఁడు చూవె • యనఘచరిత! 17

గీ॥ స్వప్రకృతిబద్ధులైనట్టి • జనులు కొంద
ఱెలమి మీఱు నాయానేమ • ములను జ్ఞాన
మునుఁ దొలంగి యాయానేమ • ములను బూని
యితరదేవతలను భజి • యించుచుండ్రు. 18

క॥ ఎవఁ డెవఁ డేయే మూర్తులఁ
బ్రవిమలభక్తుఁడయి శ్రద్ధ • వాటిలఁ గొలువన్
దివురు నె యాశ్రద్ధయె తిర
మవునట్టుల వాని వాని • కనుకూలింతున్. 19

క॥ అతఁ డారీతిని శ్రద్ధా
యుతుఁడై యామూర్తిఁ బూజ • యొనరిచి యద్దే
వతచే మద్విహితములగు
హితకామము లందెడుం జు • మీ కౌంతేయా! 20

గీ॥ దేవతలఁ బూజ సేసిన • దివిజలోక
మబ్బెడును స్వల్పబుద్ధుల • యాఫలంబు
నాశనంబగు నన్నుఁ బొం • దంగఁ గలుగు
వారు నాభక్తులగువారె • భరతముఖ్య! 21

క॥ పర మవ్యయం బనుత్తమ
మరుదగు నాభావ మెఱుఁగ • నట్టి యబుద్ధుల్
ధరలో వ్యక్తుని గాంచిన
నరుగాఁగఁ దలంతు రకట • నను నవ్యక్తున్. 22

గీ॥ యోగమాయావృతుండనై • యుండు నేన
యప్రకాశుఁడ లోకుల • కందఱకును
గాన మూఢజనంబులు • గాంచనేర
రజునిగా నవ్యయునిగాఁగ • ననఘ! నన్ను. 23

క. చన్నవి యిపుడున్నవి రా
నున్నవి భూతముల నెల్ల • నోపుదుఁ దెలియన్
నన్నో యొకఁడయిన నెఱుఁగఁ
డన్నా! భారత! పరంత • పా! కౌంతేయా! 24

మ॥ జననంబో నిముసంబునన్ బొడము ని
చ్ఛాద్వేషమోహద్వయం
బున నీ భూతములెల్లఁ గాంచెడును స
మ్మోహంబు పుణ్యంబులౌ
పనులం బాపము లెల్లఁ బాసిన నరుల్
ద్వంద్వంబులౌ మోహముల్
నన సేవింతురు నన్ దృఢవ్రతపరి
ష్కారంబుగా నర్జునా! 25

క॥ గొనకొని జరయు న్మృతియున్
బొనుపడ ననుఁ గొలుచుమాన • వులె యా బ్రహ్మా రె
ఋను నధ్యాత్మము సర్వం
బు నెల్ల కర్మముల నెఱుఁగు • పురుషులు పార్థా! 26

క॥ అధిభూతసమాయుక్తుని
నధిదైవాన్వితుని సాధి • యజ్ఞుని నన్నీ
పృథివి నెఱుంగుదు రల యు
క్తధీధురీణులు ప్రయాణ • కాలంబున నేన్. 27

ఇది బ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున విజ్ఞానయోగంబను సప్తమాధ్యాయము. 288



శ్రీ

# భగవద్గీతాశాస్త్రము.

## అష్టమాధ్యాయము.

గీ॥ పార్థుఁ డిట్లనుఁ గృష్ణ! యా • బ్రహ్మమనఁగ
నెద్ది? యధ్యాత్మమన నెద్ది? • యెద్ది కర్మ?
మెద్ది యధిభూత? మధిదైవ • మెద్ది? నాకు
వినఁగ వేడుకయయ్యె స • విస్తరముగ. 1

క॥ మధుసూదన! యీతనువున
నధియజ్ఞుం డనఁగ నెవ్వఁ • డవసానమునన్
బుధులగు నియతాత్ముల కే
విధమున జ్ఞేయుండ వనఁగ • వెన్నుఁడు వలికెన్. 2

గీ॥ పరఁగు బ్రహ్మంబనంగ న • క్షరము బరమ
మలరుచుండు స్వభావ మ • ధ్యాత్మమనఁగ
నరయ భూతభావోద్భవ • కరవిసర్గ
మెన్నఁగాఁ గర్మ మనఁబడు • నిద్ధచరిత! 3

క॥ క్షరభావం బధిభూతము
పురుషుఁడె యధిదైవతంబు • భువి నధియజ్ఞుం
డరయంగ నేన సుమ్మా
శరీరమున భరతవంశ • చంద్రమ! వింటే. 4

క॥ అవసానదశ న్నన్నుఁ గౌ
రవ! స్మరియించుచుఁ గళేబ • రము విడిచెడు మా
నవుఁ డస్మద్భావముఁ గను.
నవశ్యముగ లేదు సంది • యం బందులకై. 5

క॥ అంతమునం దేభావముఁ
జింతించుచు దేహమును ద్య • జింతురొ వారల్
గాంతురు తద్భావములన్
సంతత తద్భావ భావ • నన్ గౌంతేయా! 6

క॥ కావున న న్నెల్లపుడున్
భావించుచు సంగరంబొ • నర్పుము నాయం
దే వేళ మనోబుద్ధులు
దై వాఱన్ నన్నె పొందె • దవు నిశ్శంకన్. 7

క॥ ఇతరములం బ్రసరింపని
మతితో నభ్యాసయోగ • మహిమాన్వితుఁ డా
తతదివ్యపరమపురుషుని
నతులితగతిఁ బొందుచుండు • నను చింతనచే. 8

సీ॥ అవసానదశయందు • ననఘు లెవ్వరు భక్తి
యుక్తితో నభ్యాస • యోగబలము
కలిమి సంతతము చం • చలమానసముతోడ
భ్రూమధ్యమునఁ బ్రాణ • మును సమర్చి
సర్వజ్ఞు సర్వశా • సకు సమస్తాధారు
భావనాతీతుఁ ద • మోవిదూరు
నణువుకన్నను సూక్ష్మ • మగువాని నాదిత్య
వర్ణుఁ బురాణుని • బరమపురుషు

గీ॥ అనిశమును జింతఁ జేసెడు • నమ్మహాత్ము
లందఁజాలుదు రేసంది • యంబు లేక
పరమపురుషుని దివ్యుని • బ్రహ్మమయునిఁ
దెలియఁ బల్కితి నీకుఁ గుం • తీకుమార! 9

ఉ॥ దేనిని వేదవేత్తలు ను • తించెద రెంతయు నక్షరంబుగా
దేనిని వీతరాగులు య • తిప్రవరుల్ దగఁ జొచ్చుచుందు రె
ద్దానినిఁ గోరి చేయుదురు • తత్పరబుద్ధిని బ్రహ్మచర్య మా
స్థానము సంగ్రహంబుగఁ బృ • థాసుత! నీకొఱకై వచించెదన్.

గీ॥ ద్వారములఁ జక్క నియమించి • తత్పరతను
డెందమందున మనసుఁ బెం • పొంద నిల్పి
తనదుప్రాణంబు మూర్ధమం • దున సమర్చి
యోగధారణమందుఁ దా • నొప్పమీఱి. 11

గీ॥ ఓ మనెడు నక్షరబ్రహ్మ • ముచ్చరించు
చును నను దలంచుచును దేహ • మును విడుచుచు
బయలు వెడలు మహాత్ముఁ డా • పరమగతిని
బొందుచున్నాఁడు నిశ్చయం • బుగఁ గిరీటి! 12

క॥ ఇతరములం దవులనిమతి
సతతం బెడలేక నన్ను • స్మరియించెడు మా
నిత నిత్యయుక్త యోగికి
నతిసులభుఁడ నేను భార • తా! తలపోయన్. 13

క॥ పరమంబగు సంసిద్ధిని
బొరయు మహామహులు నన్నుఁ • బొందినపిదపన్
మరల నశాశ్వతదుఃఖా
స్పదపునర్జన్మమునకు • శత్రువిదారీ! 1

క॥ పునరావృత్తియె బ్రహ్మభ
వనాదిలోకములలోఁ బ్ర ♦ వర్తిలు నను బొం
దిన ధన్యుం డగు మహనీ
యునకుఁ బునర్జన్మ మొదవ ♦ దుత్తమచరితా! 15

క॥ యుగములు సహస్రమయినన్
బగ లొక్కటి యగును బ్రహ్మ ♦ భవునకు నట్లే
యగు రాతిరి పదినూరుల
యుగము లనుచుఁ దెలియఁ గలర ♦ హోరాత్రవిదుల్. 16

క॥ విను మవ్యక్తమునుండియె
జననంబగు పగలు రాగ ♦ సర్వవ్యక్తుల్
సను లీనము లై రే దోఁ
చినచో నవ్యక్తమని వ ♦ చించెదు నచ్చోఁ. 17

క॥ దివసాదిని భూతోత్కర
మవశంబై యుదయమగు ని ♦ శాగమమందున్
బ్రవిలీనం బగు నిట్లు
ద్భవమయి యయి లయము నొందుఁ ♦ బాండుకుమారా! 18

క॥ విను మాయవ్యక్తముక
న్న నన్య మవ్యక్తమును స ♦ నాతనముఁ బరం
బును నగు భావము నాశన
మును జెందదు సర్వభూత ♦ ములు రూపఱినన్. 19

గీ॥ అక్షరంబంచు మఱియు న ♦ వ్యక్తమంచుఁ
బరమగతియంచు నెయ్యది ♦ పలుకఁబడుచు
నెందుఁ జేరిన మరల రా ♦ కుందు రది యె
పరమధామంబు నా కగుఁ ♦ బాండవేయ! 20

క॥ ఓపార్థ! భూతసంచయ
మేపురుషునిలోన నుండు ♦ నెవ్వఁడు సర్వ
వ్యాపకుఁ డతండు పరుఁడు మ
హాపురుషుఁడు లభ్యుఁ డెప్పు ♦ డనితరభక్తిన్. 21

గీ॥ ఎట్టికాలమందు ♦ నేగెడు యోగులు
మరల జన్మ మెత్త ♦ మనికి రారొ
జన్మ మెత్తి మరలఁ ♦ జను రెంతురో యట్టి
కాలమును వచింపఁ ♦ గడఁగుః

గీ॥ అగ్ని జ్యోతి పగలు ♦ వల శుక్ల పక్షంబు
గాఁగ నాఱు నెలల ♦ కాల ముత్త
రాయణంబు నందుఁ ♦ బోయిన బ్రహ్మ వే
త్తలకె కలుగు బ్రహ్మ ♦ మలఘుమహిమ. 23

క॥ పొగ రేయి కృష్ణపక్షము
నగు షణ్మాసములు దక్షి ♦ ణాయనమన నం
దుగతించినట్టి యోగియె
మగుడన్ జన్మించుఁ జాంద్ర ♦ మస తేజమునన్. 24

గీ॥ జగమునకు శుక్ల కృష్ణప ♦ క్షములు శాశ్వ
తంబులగు త్రోవలని నామ ♦ తంబ యొకట
నందవచ్చు ననావృత్తి ♦ నన్యమయిన
దాని చేఁ బునరావృత్తి ♦ దారసిల్లు. 25

క॥ విను మీగతు లెఱిఁగిన యే
ఘన యోగియుఁ గాఁడు మోహ ♦ కలితుం డోయ
ర్జున! కాన నెల్ల వేళల
నొసరంగా నీవు యోగ ♦ యుక్తుఁడ వగుమా. 26

గీ॥ శ్రుతులఁ గ్రతువులఁ దపముల ♦ వితరణములఁ
గలుగునని చెప్పఁబడు పుణ్య ♦ ఫలము లెల్ల
దీని నెఱిఁగిన యోగి య ♦ తిక్రమించుఁ
బడయు మఱియును నాద్యమౌ ♦ పరమపదము. 27

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున అక్షరపరబ్రహ్మయోగమను అష్టమాధ్యాయము. 315





# భగవద్గీతాశాస్త్రము.



## నవమాధ్యాయము.

మ. అనసూయాత్మకుఁడైన నీ కతిరహ • స్యంబైన విజ్ఞానమం
దిన జ్ఞానం బెఱిఁగింతు దాని దెలియన్ • జేకూరు మోక్షంబుమా
ను నశేషాశుభముల్ కిరీటి! యని కృ • ష్ణుం డింద్రసూనుం గనుం
గొనివాత్సల్యవిశేషముప్పతిలఁ బ • ల్కెన్ దేనియల్ చిల్కఁగన్.

గీ॥ ఇదియె రాజవిద్య • యిది రాజగుహ్యము
త్తమము పావనంబు • ధర్మ్య మవ్య
యంబు సేయ సులభ • మరియుఁ బ్రత్యక్షావ
గమము సూవె యెన్నఁ • గాఁ గిరీటి! 2

గీ॥ ఇట్టి ధర్మమార్గ • మెఱుఁగని యశ్రద్ధ
ధానులైన తెలివి • లేనివార
లందలేక నన్ను • నలమృత్యుసంసార
వర్త్మమునకె మరలు • వారు పార్థ! 3

గీ॥ అర్జునా! సర్వజగముల • వ్యక్తమూర్తి
నైన నాచేత వ్యాప్తంబు • లయ్యె సర్వ
మైనభూతంబు లుండు నా • యందు నేను
వానిలోపల నున్నట్టి • వాఁడఁ గాను. 4

నీ విడునది నీతపమును
గావింపు మదర్పణంబు ♦ గాఁ గౌంతేయా! 27

క॥ కాన శుభాశుభఫలములు
పూనెడు నీకర్మబంధ ♦ ముల ముక్తుఁడవై
కానంగానగు నన్నుఁ బెం
పూనిన సన్న్యాసియోగ ♦ యుక్తుఁడ వగుచున్. 28

గీ॥ సర్వభూతసముఁడ ♦ శత్రులు మిత్రులు
నాకు లేరు భక్తి ♦ నన్నుఁ గొలుచు
చున్నవార లెల్ల ♦ రుందురు నాయందు
నుందు నేను వారి ♦ యందుఁ బార్థ! 29

క॥ పరమదురాచారుండై
పరగియు నన్నుఁ దక్కఁ బెఱల ♦ భజియింపనిచో
స్థిరనిశ్చయాత్ముఁ డగుటన్
వరసాధువుగాఁ దలంపఁ ♦ బడుఁ గౌంతేయా! 30

క॥ అతఁడే ధర్మాత్ముండగు
నతిశీఘ్రముగాఁగఁ బొందు ♦ నాతండే శా
శ్వతశాంతిని మద్భక్తుఁడు
క్షితిఁ జెడిపోఁడని ప్రతిజ్ఞఁ ♦ జేయుము పార్థా! 31

క॥ స్త్రీలును వైశ్యులు శూద్రులు
నాలాగే పాపయోను ♦ లందఱు నన్నుం
బోలంగ నాశ్రయించినఁ
జాలుదు రుత్తమపదంబు ♦ సంపాదింపన్. 32

క॥ అనఘులు భక్తులు బ్రాహ్మణ
జనములు రాజర్షులను ప్ర • శంస లిఁకేలా
నను భజనసేయుమసుఖం
బనిత్య మగు నిట్టిలోక • మందుండుటచే. 33

క॥ మదధీనమానసుండవు
మదీయభక్తుఁడవు నగుము • మద్యాజివి మో
దు్పదలిర్ప మత్పరాయణ
ముదితాత్మనియుక్తి నన్నుఁ • బొందఁగవచ్చున్. 34

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున రాజవిద్యారాజగుహ్యయోగమను నవమాధ్యాయము. 349



శ్రీ

# భగవద్గీతాశాస్త్రము.

## దశమాధ్యాయము.

క॥ భగవంతుఁ డిట్టు లనుఁ బ్రీ
తిగ విని సంతసిలు నీకుఁ ◆ దిరిగియుఁ బ్రియ మిం
పుగఁ జేయుతలంపునఁ బర
మగుమాట వచింతు విను మ ◆ హాబాహుయుగా! 1

క॥ సురవరులు మహర్షు లెఱుం
గరు మత్ప్రభవంబు లెస్స ◆ గా దేవసము
త్కరమునకు మహర్షుల కే
నరయఁగ నాద్యుండఁ జూవె ◆ యన్ని తెఱఁగులన్. 2

గీ॥ అజునిగాఁగ ననాదిగా ◆ నఖిలలోక
ముల మహేశ్వరుఁగా నన్నుఁ ◆ దెలిసికొనెడు
ఘనుఁడగు నతం డసమ్మూఢుఁ ◆ డనఁగ నెగడి
సర్వపాపవిముక్తుఁ డౌ ◆ సవ్యసాచి! 3

చ॥ శమము దమంబు బుద్ధి క్షమ ◆ సత్యము జ్ఞానము సౌఖ్యదుఃఖముల్
సమత భయాభయంబులు య◆శం బపకీర్తి యహింస తుష్టి దా
నముఁ దపము న్విమోహము వి◆నాశనమున్ జననంబు భూతసం
ఘముల కనేకభావములు ◆ గానగు నావలనన్ ధనంజయా! 4

గీ॥ మొదటి సప్తమహర్షులు ♦ మునివరులగు
సనకముఖ్యులు మనువులు ♦ జనన మయిరి
నామనంబున మద్భావ ♦ నముసఁ జేసి
వారివలన జనించి రీ ♦ ప్రజలు జగతి. 5

క॥ ఈనావిభూతియోగము
మానుగఁ దత్త్వము నెఱుంగు ♦ మహనీయుండే
పూనెడు నిశ్చలయోగము
దీనికి సందియము లేదు ♦ తెలియఁగఁ బార్థా! 6

క॥ సర్వప్రభవుఁడ నే నని
సర్వము నావలన నెపుడు ♦ జరిగెడునని యం
తర్వాణులు బుధు లారసి
పర్విన భావముల నన్ను ♦ భజియింతురుగా. 7

ఉ॥ చిత్తము నాకు దత్తమును ♦ జేయుచుఁ బ్రాణములన్సదామదా
యత్త మొనర్చి నన్నుఁ దెలి ♦ యంగఁ బరస్పరబోధనైకసం
పత్తిని హత్తి మత్కథలఁ ♦ బాడుచు నిత్యము సంతసంబు రే
కెత్తఁగఁ గ్రీడ సల్పుచు ర ♦ హిం గనువారలు వాసు ఫల్గునా! 8

గీ॥ సతతయుక్తులగుచు ♦ సంప్రీతిపూర్వకం
బుగ భజించునట్టి ♦ పుణ్యులకును
బుద్ధియోగ మేను ♦ పూని ప్రసాదింతు
నందువలన నన్నుఁ ♦ బొందఁగలరు. 9

ఉ. వారల యాత్మభావముల ♦ వాసముఁ జేయుచు వారిపైఁ గృపన్
పేరిమి మీఱి వారి యవి ♦ వేకభవంబగు నంధకారమున్

బాలుఁగఁ దోలుచుండుఁ బ్రవి • భాసితమైన వివేకదీపవి
స్తారముచే ననన్ విని పృథానుతుఁ డిట్లను వాసుదేవుతోన్.

సీ॥ నీవ పరబ్రహ్మ • మీవ పరంధాముఁ
డవుఁ బరమపవిత్రుఁ • డవును నీవ
నిన్ను శాశ్వతునిగా • నిత్యునిగా దివ్య
పురుషునిగాఁగ వి • భుండు గాఁగ
నాదిదేవుని గాఁగ • నజునిగా సకలర్షి
వారంబు దేవర్షి • వరుఁడు నార
దుండును నల యసి • తుండు దేవలుఁడును
బాదరాయణుఁడును • బల్కుచుండు

గీ॥ రీవు నట్లు స్వయము • గా వచియించుచు
న్నావు నాకుఁ దెలియ • దేవదేవ!
కృష్ణ! హరి! ముకుంద! • కేశవ! గోవింద!
వాసుదేవ! భక్త • వరద! శౌరి! 11

క॥ ఓ కేశవ! నీవ్యక్తిన్
నాకులు దానవులుఁ గనఁగ • నంజాల రిఁకన్
నాకో టుపదేశించిన
వాకులు సత్యమని తలఁచు • వాఁడ ముకుందా! 12

గీ॥ దేవదేవ! భూత • భావన! పురుషోత్త
మా! జగత్పతీ! స • మస్తభూత
భర్త! తెలిసికొనెదు • స్వయముగా నీవాత్మ
నాత్మచేత నేమ • హానుభావ! 13

క॥ దేవర దివ్యవిభూతులు
భూవలయములెల్ల నిండి • పొలుపొందెడు నీ
వే వానిఁ జెప్పఁదగుదువు
భావింప నశేషముగాఁ గృ • పాపరహృదయా! 14

క॥ ఏవిధమున నే నిరతము
భావించుచు నిన్నుఁ దెలియ • వలనగు నేయే
భావములను జింత్యుండవు
నావలనన్ యోగిమండ • నా! జగదీశా. 15

క॥ వినిపింపుము నీ యోగం
బును నీదు విభూతిఁ దోర • ముగ నయ్యమృతం
బును నెంత చెవులఁ జుఱ్ఱినఁ
దనివి జనింపదు బుధస్తు • తప్రీతిభాష్యా! 16

గీ॥ అనుడు నర్జునుతో జనా • ర్దనుఁడు వలికె
నా శుభవిభూతులను బ్రధా • నముల నీకుఁ
జెప్పెదను నావిభూతివి • శేషములకు
నంత మెన్నఁడు లేదుగ • దా కిరీటి! 17

సీ॥ సర్వభూతాశయ • స్థమగు నాత్మము తదీ
యాదిమధ్యాంతంబు • లగుదు నేన
యాదిత్యులందు వి • ష్ణ్వభిధానుఁడగు నేన
యంశుమద్రవికాంతు • లందు నేన
విను మరీచినిక్క నేన • ఘనమరుత్తులలోన
నుడుసర్గమందుఁ జం • ద్రుఁడను నేన

సకలవేదములందు ♦ సామవేదము నేన
దివిజులలోన వా ♦ సవుఁడ నేన

గీ॥ ఇంద్రియములందు మానస ♦ మేన చూడ
భూతసంఘాతమం దేను ♦ జేతనంబ
రుద్రులం దెన్నఁగా శంక ♦ రుండ నేన
యక్షరాక్షసులందు నే ♦ నర్థపతిని. 18

సీ॥ వసువులలోపలఁ ♦ బావకుండను నేన
శిఖరులందున మేరు ♦ శిఖరి నేన
వరపురోహితులందు ♦ వాచస్పతిని నేన
సేనానులందు సే ♦ నాని నేన
సరసులలోపల ♦ సాగరంబను నేన
భృగువు మహర్షులం ♦ దగుదు నేన
వాక్కులలోఁ బ్రణ ♦ వంబు నే నౌదును
జపయజ్ఞమేన య ♦ జ్ఞంబులందు

గీ॥ స్థావరముల హిమాద్రి న ♦ శ్వత్థవృక్ష
మేన వృక్షములను దివ్య ♦ ఋషులలోన
నారదుండను సుమ్ము గం ♦ ధర్వులందుఁ
జిత్రరథుఁడను గపిలుండ ♦ సిద్ధులందు. 19

క॥ అమృతముతోఁ బొడమిన యు
చ్చైశ్శ్రవమ నేనశ్వంబులందు ♦ సామజములయం
దమరగజ మేన నరులం
దమర గుడాకేశ! నేన ♦ రాధిపుఁడఁ జుమీ. 20

గీ॥ ఆయుధంబులలో వజ్ర ♦ మగుదు నేన
ధేనువులలోపలను గామ ♦ ధేను వేన
ప్రజలను సృజించునట్టి ద ♦ ర్పకుఁడ నేన
సకలసర్పంబులందు వా ♦ సుకుని నేన. 21

గీ॥ నాగసంతానమందు న ♦ సంతుఁ డేన
వరుణుఁ డేన జలాధిదే ♦ వతలలోన
నర్యముఁడఁ బితృదేవత ♦ లందు నేన
దండన మొనర్చువారిలో ♦ దండి నేన. 22

క॥ దానవతతిఁ బ్రహ్లాదుఁడ
నేనే కాలంబ గణక ♦ నికరములోనన్
నేనే సింగము మృగముల
నేనే వినతాసుతుండ ♦ నీడజములలో. 23

గీ॥ వాయువును నేను బరిశుద్ధ ♦ వస్తులందు
రామచంద్రుఁడ నే ధను ♦ ర్ధరులలోన
మత్స్యవర్గంబులోపల ♦ మకరి నేన
నదిప్రవాహంబునందు జా ♦ హ్నవిని నేన. 24

గీ॥ ఆదిమధ్యాంతములు సృష్టి ♦ కగుదు నేన
విద్యలందెన్న నధ్యాత్మ ♦ విద్య నేన
వాద మొనరించువారిలో ♦ వాద మేన
యక్షరములం దకారంబు ♦ నగుదు నేన. 25

గీ॥ వరసమాసంబులందు ద్వం ♦ ద్వంబు నేన
యక్షయంబగు కాలంబు ♦ నగుదు నేన

ధాత యనఁగా జగంబుల ♦ ఖ్యాతిఁ గాంచు
విశ్వతోముఖుఁడను నేన ♦ విశదముగను. 26.

గీ॥ అన్నియు హరించు మృత్యువు ♦ నగుదు నేన
కాఁ గలుగు నుద్భవం బేన ♦ కా తలంపు
స్త్రీలకీర్తియు సిరియును ♦ ధృతియు స్మృతియు
వాక్కు మేధయు క్షమయుఁ జె ♦ ప్పంగ నేన. 27

గీ॥ సామములలోపలను బృహ ♦ త్సాము నేన
ఛందములను గాయత్రి యన్ ♦ ఛంద మేన
మాసములయందు నెన్న నే ♦ మార్గశిరము
నేన కుసుమాకరంబను ♦ ఋతువులందు. 28

గీ॥ వంచకుల జూద మేన సు ♦ మ్మెంచి చూడ
దివ్య తేజస్వులందలి ♦ తేజ మేన
నేన జయమును వ్యవసాయ ♦ మేను జూవె
సత్యవంతులలోపలి ♦ సత్య మేన. 29

గీ॥ వాసుదేవుండ యాదవ ♦ వరులలోనఁ
బాండునందనులందుఁ బా ♦ ర్థుండ నేన
వ్యాసుఁడను నేన సకలసం ♦ యములలోనఁ
గవులలో సన్నుతింపఁ భా ♦ ర్గవుఁడ నేన. 30

గీ॥ శిక్ష లొనరించువారల ♦ శిక్ష నేన
జయముఁ గాంక్షించువారి నీ ♦ తియును నేన
యమరు గుహ్యము లందు మా ♦ నమును నేన
జ్ఞానవంతులలోపలి ♦ జ్ఞాన మేన. 31

ఉ॥ ఏన సమస్తభూతముల • కెన్నఁగ బీజము నీచరాచరం
బైన యశేషభూతనివ • హంబును నావలనన్ జనించు నేఁ
గానిది లే దొకండును బ్రి • కాశితమై తగు మద్విభూతిసం
తాన మనంతవిస్తరము•దానిని జెప్పితి సంగ్రహంబుగాన్. 32

క॥ ఈమహి విభూతిమహిమో
ద్దామశ్రీసుమహితోర్జి • తప్రతిసత్వ
స్తోమము మత్తేజోంశ
స్థేమోద్భవ మనుచుఁ దెలియు • ధీమంతుఁడవై. 33

క॥ ఐనను నీ కీవిపుల
జ్ఞానముచే లాభ మేమి? • సర్వజగత్సం
తానముల నిండియుండితి
నే నేకాంశమున ధార • ణీవరతనయా! 34

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున విభూతియోగమను దశమాధ్యాయము. 383





# భగవద్గీతా శాస్త్రము.



## ఏకాదశాధ్యాయము.

మ॥ హరితో నిట్లనెఁ గ్రీడి దేవ! పరమం ♦ బైనట్టి యధ్యాత్మత
త్త్వరహస్యంబును జెప్పితీవు చనెఁ ద ♦ థ్యం బెల్ల మోహంబు వి
స్తరరీతి న్వినన య్యెఁ భూతముల యు ♦ త్పత్తి న్వినాశంబు దే
వరమాహాత్మ్యముదివ్యమవ్యయముఁ జె ♦ ప్పన్ వింటిధన్యుండనై.

ఉ॥ ఓ పరమేశ్వరా! వరద! ♦ యో పురుషోత్తమ! యోగరాట్ప్రభూ!
నీ పలుకుల్ యథార్థములు ♦ నిన్నుఁ గురించిన భావముల్ గనన్
జూపుము వేడ్కయయ్యెడుఁ గ ♦ నుంగొన నైశ్వరిమైతెనర్చు నీ
రూపము దివ్య మవ్యయముఁ ♦ జూపి వఁగనర్హుఁడనంచు నెంచినన్.

మ॥ అనినం గేశవుఁ డానతిచ్చెను మదీ ♦ యాకారవిస్తార మె
న్న ననేకాకృతు లన్ని చందములు నా ♦ నావర్ణముల్ దివ్యముల్
వినుతింపంగ నశక్యముల్ శతములున్ ♦ వేలంచుఁ గన్నుంగనన్
గనునద్దాని ఫలంబుగాఁ గనుము జ ♦ న్మంబంద సాఫల్యముల్.

క॥ వసురుద్రాదిత్యమరు
ద్విసరంబుల నశ్వినీత ♦ తిం గనుఁగొను సం
తసమున నదృష్టపూర్వము
లసంఖ్యములు నైనయట్టి ♦ యాశ్చర్యములన్.

చ॥ ఇదె సచరాచరంబయిన • యెల్ల జగంబును జూడఁ గోరె దె
యద్ది యది యంతయున్ గనఁగ • నా నొక తావున నాశరీరమం
దదియునుగాక ప్రాకృతము • లైన కనుల్ ననుఁ జూడలే వాసం
గెద నిదె దివ్యదృష్టిఁ బరి • కింపఁగ నైశ్వరమైన యోగమున్.

గీ॥ సంజయుం డను ధృతరాష్ట్ర • జనపతీంద్ర!
హరి మహాయోగి శేఖరుం • డట్లు వలికి
యైశ్వరంబును బరమమై • నట్టి విశ్వ
రూపమును జూపెఁ గరుణ న • ర్జునున కపుడు. 6

క॥ ఆదిస్వరూప మద్భుత
మై దివ్యాననవిలోచ • నానేకయుతం
బై దివ్యాలంకారం
బై దివ్యాయుధసమేత • మై కనుపట్టెన్. 7

గీ॥ దివ్యమాల్యాంబరోపేతు • దేవదేవు
దివ్యగంధానులేపనో • దీర్ణ దేహు
సర్వతోముఖు సంతతా • శ్చర్యమయు న
నంతు వీక్షించె నప్పాండు • నందనుండు. 8

క॥ ఆదిత్యసహస్రద్యుతు
లా దివి నొక్కమొగి నెగయ • నగు దీప్తి కదా
సాదృశ్య మమ్మహాత్ముని
దేదీప్యంబైన దివ్య • తేజంబునకున్. 9

క॥ దివిజేంద్రసుతుం డొకచో
నవలోకించెను మహాత్ముఁ • డగు హరి మేనన్
వివిధప్రకారములుగాఁ
బ్రవిభక్తంబైన యా ప్ర • పంచం బెల్లన్. 10

క॥ అటువిమ్మట నాకవ్వడి
పటువిస్మయరోమహర్ష ♦ బంధురుఁ డగుచున్
నిటలతటఘటితనిజకర
పుటుఁడై దేవునికి భక్తి ♦ మ్రొక్కి వచించెన్. 11

గీ॥ దేవ! నీదేహమం దేను ♦ దేవతలను
సకలభూతౌఘములఁ గమ ♦ లాసనస్థు
బ్రహ్మదేవుని సంయమి ♦ వ్రాతములను
నురగములను దివ్యులను జూచు ♦ చున్నవాఁడ. 12

గీ॥ విశ్వరూప! విశ్వేశ్వర! ♦ వేదవేద్య!
బహుభుజోదరలోచన ♦ వదనసహితు
నంతట ననంతరూపుని ♦ న్గాంతుఁ గాన
నాదిమధ్యావసానంబు ♦ లరయ నీకు. 13

ఉ॥ చారుకిరీటము ల్గదలు ♦ చక్రములుం జెలువారఁ దేజ మా
కారముఁ గాంచినట్టులు ప్ర ♦ కాశము దిక్కులు పిక్కటిల్ల దీ
ప్తారుణపావకద్యుతిన ♦ మగ్రరుచుల్ మిరుమిట్లు గూర్పఁ బెం
పారెడు నప్రమేయుఁ బర ♦ మాత్మ నినుం గనుచుంటి నీశ్వరా!

గీ॥ ఎఱుఁగఁ దగిన పరబ్రహ్మ ♦ మీవ చూవె
యీప్రపంచనిధానంబ ♦ నీవ చూవె
నిత్యుఁడవు ధర్మగోప్తవు ♦ నీవ చూవె
కాన నిన్నాదిపురుషుని ♦ గాఁ దలంతు. 15

గీ॥ ఆదిమధ్యాంతరహితు న ♦ నంతవీర్య
వంతు బహుబాహుశోభితు ♦ భానుచంద్ర
నేత్రు దీప్తాగ్నివక్త్రుని ♦ నిన్గనియెద
విశ్వముఁ దపింపఁ జేయు దీ ♦ ప్తిఁ గలవాని. 16

ఉ॥ నింగియు నేల దిక్కులను • నిండిన నీభయదోగ్రరూప ము
ల్లం గని ముజ్జగంబులు త • లంకెడు దేవత లెల్లవారు భీ
తింగొని నిన్నుఁ జొత్తురు స్తు•తింతురు కొందఱు కేలు మోడ్పులన్
మంగళమంచు సిద్ధులును•మౌనులు నిన్ను నుతింతు రెంతయున్.

క॥ అల రుద్రాదిత్యవరా
నిలవసు విశ్వాశ్వ్యూష్మపాళి • నీరాక్షసయ
క్షులు సిద్ధసాధ్యగంధ
ర్వులు నినుఁ గనుఁగొనెద రచ్చె • రువు దళుకొత్తన్. 18

క॥ పలు మోములు పలు కన్నులు
పలు బాహువులు తొడలు కాళ్ళు • పలు కడుపులు కో
రలుగల నీవిక్రుతాకృతిఁ
బెలుచం గని జగము లదరె • బెదరితి నేనున్. 19

క॥ మిన్నంది వెలుగుచుం బలు
వన్నెలఁ జెన్నొంది వివృత • వదనముఁ గెంపుం
గన్నులుగల నిన్నుం గని
విన్నందన మడలెఁ దాల్మి • విడివడుచుండెన్. 20

క॥ కాలానలసమదంష్ట్రా
భీలాస్యములఁ గన సంభ • విలె దిగ్భ్రమ మే
లీల సుఖంబగుఁ గరుణం
బాలింపు జగన్నివాస! • పరమాత్మ! హరీ! 21

మ॥ ధృతరాష్ట్రాత్మజ భీష్మ కర్ణ గురు లు • ర్వీపాళితో నస్మదా
తత యోధోఘముతో భయానకభవ • ద్దంష్ట్రాకరాళాస్యముల్
ద్రుతరీతిం బరువెత్తుచున్ జొరెద రం•దుం గొందఱత్యంతచూ
ర్ణితమస్తంబులఁ గానవత్తురు మురా•రీ! నీదు వల్నందులన్. 22

ఉ॥ భూరిజలప్రవాహములు • పొంగఁగఁ దుంగతరంగిణుల్ మహా
వారిధి కాభిముఖ్యముగ • వచ్చి తదీయముఖాంతరంబునన్
జేరెడునట్లు వీరనృప • శేఖరులెల్ల భవజ్జ్వలన్ముఖ
ద్వారమునందుఁ జొచ్చుట ధ్రు•వంబుగఁ జూడఁగనయ్యె నచ్యుతా.

క॥ దరికొని మండెడునగ్నిన్
సరగునఁ బొరివోనఁ జొచ్చు • శలభములగతిన్
నరవరులు భవన్ముఖగ
ద్వారమున రూపఱఁ బ్రవేశ • మందెదరు త్వరన్. 24

క॥ ఓజస్సు సకలజగముల
రాజిల్ల సమస్తజనులఁ • బ్రజ్వాలదాస్యాం
భోజముల మ్రింగి చవిఁగొని
తేజమునఁ దపింపఁబూని • తివి భువనములన్. 25

మ॥ భయదాకారముతోఁ దనర్చితివి దే
వా! యానతీయంగ దే
దయ నెవ్వాఁడవొ నీవు చేకొను మనం
తా! నా నమస్కారముల్
ప్రియమారంగఁ బ్రసన్నతామతి భవ
ద్వృత్తాంత మాద్యంత మెం
తయు నాద్యుండవు గానఁ దెల్పుము వినన్
గౌతూహలం బయ్యెడిన్. 26

చ॥ అనవుడు నచ్యుతుం డనియె • నర్జునుతోడ జగత్క్షయార్థ మీ
యనువున వృద్ధినొందిన కృ•తాంతుఁడ లోకములన్ హరింపఁ దెం
పునఁ బనిఁ బూనితిన్ రిపుచ • మూవరవీరులనెల్ల నీవు నా
శన మొనరింపకుండినను • జత్తురు వారికఁ గౌరవోత్తమా! 27

ఉ॥ కావున నీవు యుద్ధమునకై యిఁక లెమ్ము జయింపు శత్రులన్
కీవిఁ దలిర్పఁ గీర్తి నెగ ♦ డింపు మకంటకమైన రాజ్యల
విభవంబుఁ జేకొని సు♦ఖింపుము వారిని మున్నె చంపితిన్
నీవు నిమిత్తమాత్రముగ ♦ నిల్వుము కౌరవవంశదీపకా! 28

మ॥ త్వరమీరం బరిమార్పు మేను మునుఁ ద
త్ప్రాణంబులం గొన్న య
ద్గురు గాంగేయ జయద్రథార్కజ ముఖ
క్షోణీశులన్ యోధులన్
దర మేలా దుర నాచరింపు మిఁక యు
ద్ధంబందు నీ వైరులం
దఱఁ గెల్వంగల విట్లు సంజయుఁడు వా
ర్తల్ సెప్పె నాద్యంతమున్. 29

శా॥ ఆమాటల్ విని పాకశాసని ప్రకం ♦ పాయత్త చిత్తంబునన్
గై మోడ్పుల్ దనరార శౌరికి నమ♦స్కారంబులం జేయుచున్
వేమాఱున్ గడుభీతి నమ్రుఁ డగుచు♦న్విభ్రాంతి వాగ్వైఖరిన్
స్వామిం జూచి వచింపగాఁ దొడఁగెఁ జం♦చద్భక్తి పెంపారగన్.

మ॥ నినుఁ గీర్తించుటచేత ముజ్జగము సం ♦ ధిల్లంగ సంతోష మ
త్యనురక్తిం దనరారుచున్నయది దై ♦ త్యగ్రామణుల్ భీతులై
చనుచున్నారు దిశాముఖంబున నమ ♦ స్కారంబులన్ సిద్ధుల
ర్థిని గావించుచు నున్నవారలు బళా♦ రే! యుక్తమౌనే కదా.

ఉ॥ దేవ! జగన్నివాస! జగ ♦ తి న్సదసత్పరమైన బ్రహ్మమే
నీ వల యక్షరుండ వన ♦ నీవె యనంతుఁడ వాదికర్త వౌ
దీవె చతుర్ముఖాదులకు ♦ నీవె గరీయుఁడవు న్మహాత్ముఁడా!
కావున నీకు నేనిటికిఁ♦గా నతి సేయక యుందు రెవ్వరున్? 32

గీ॥ నీవ యాదిపురుషుఁ • డీ వాది దేవుండ
నీవ పరనిధాన • మీ జగతికి
నీవ వేత్త వేద్య • మీవె పరంధామ
మఖిలమయుఁడ వీ వ • నంతరూప! 33

గీ॥ వాయుదేవుండు యముఁ డగ్ని • వరుణుఁ డబ్జ
జుఁడు ప్రజాపతి ప్రపితామ • హుఁడును నీవ
వేయుమారులు నతులు గా • వింతు నీ క
నేకపర్యాయములు నమ • స్కృతులు దేవ! 34

క॥ సర్వనతులు మున్వెనుకల
సర్వదిశల నీ కొనర్తు • సాష్టాంగనతుల్
సర్వము బొందుటవలనన్
సర్వుండ వనంతవీర్య • సామగ్ర్యుఁడవై. 35

ఉ॥ ఇంతటివానిగాఁ దెలియ • కేఁ బొరపాటున నెయ్యుఁడంచు నే
కాంతమునన్ బుధాళినము • ఖంబునఁ గేరితి నప్రమేయ ని
న్నెంతయుఁ గృష్ణ!యాదవ! చెలీ!యనుచున్ శయనాసనాశనా
శ్రాంతవిహారవేళల న • సత్కృతి నేరము సైఁపు మచ్యుతా!

గీ॥ ఈచరాచరజగముల • కీవ తండ్రి
నీవ గురుఁడు గరీయుఁడ • వీవు పూజ్యుఁ
డవు సముఁడులేఁడు నీకన్న • నెవ రధికులు
మహిని దలపోయ నప్రతి • మప్రభావ! 37

ఉ॥ కావున దండవన్నతులు • గైకొనిప్రోవు ప్రసన్నతామతిన్
దేవ! మహేశ! యాద్య! కరుణింపు వలంతిని సైఁచి తప్పులన్
సేవను గన్నతండ్రి సుతునిం దన మిత్రుని బ్రాణమిత్రుఁడుం
భావమునంగృపాదృతిగ • నంబడఁగా బ్రియుఁడున్ బ్రియుంబలెన్.

క॥ మునుఁ జూడనిదానిని గనుఁ
గొన హర్షమె యైన వణఁకుఁ • గొన్నది మది భీ
తిని; జూపుము కనికరమున
మునుపటిరూపంబె దేవ! • భువననివాస! 39

చ॥ శిరము కిరీటకాంతి విల • సిల్ల గదంగొని చక్రపాణివై
కర మలరారు నిన్నుఁ గనఁ • గా మదిఁ గోరెద నో సహస్రబా
హారుచిర! విశ్వరూప! భవ • దూర్జితపూర్వచతుర్భుజాకృతిన్
గరుణఁ దలిర్పఁ గైకొనుము•కన్నులపండువుగాఁగఁజూచెదన్.

మ॥ అనినం గృష్ణుఁడు వల్కె నర్జునునితో•నాద్యం బనంతంబు మ
ద్ఘన తేజోమయవిశ్వరూప మది వే•డ్కం జూపితిన్ గూర్మి పే
ర్మిని నాకుంగల యోగపుంబలిమి క•ల్మిన్ దాని నెవ్వారలున్
మును వీక్షింపరు నీవు దక్క నిపు డో • భూపాలవంశాగ్రణీ!

ఉ॥ వేదములన్ బఠించినను • విశ్రుతయజ్ఞము లెన్ని చేసినన్
సాదరమార దానము లొ • నర్చిన నుగ్రతపంబు సల్పినన్
మేదురకర్మశీలురయి • మించిన మేదిని నీకుఁ దక్కఁగన్
నాదగు విశ్వరూపము గ • నం బెఱవారికి దుర్లభం బగున్. 42

ఉ॥ ఈదృశఘోరరూపమును • నీవు గనుంగొని బాధనొందఁగా
రాదు విమూఢభావమున•మ్రాన్పడియుండఁగరాదు నిర్భయం
బూది ప్రమోదమున్మరల•నొందఁగ డెందము ప్రీతిఁజూడుమా
నాదగు పూర్వరూపము ధ•నంజయ! యంచు గదాధరుండనెన్.

క॥ అని సంజయుండు ధృతరా
ష్ట్రునితో ని ట్లనియె సౌమ్య • రూపముఁ గొంతే
యునికి హరి సూపి యాతని
మనసునఁ బొడమిన కలంత • మాన్పినపిదపన్. 44

క॥ నరుఁ డిట్లు విన్నవించెను
హరి నీదు ప్రసన్నమాన ♦ నాకృతిఁ గనుటన్
బొరసితిఁ జైతన్యంబున్
మరలన్ స్వస్థతయుఁ దొంటి ♦ మార్గముఁ గంటిన్. 45
క॥ అనవుడు హరి యిట్లను నీ
కనిన మదాకృతిని జూడఁ ♦ గడుదుస్తర మిం
తననేల సురలు సయితము
ననయము దర్శింపఁగోరు ♦ నట్టిది పార్థా! 46
క॥ తొలిచదువులు చదివినఁ దప
ములు సలిపిన మిగుల దాన ♦ ములు సేసిన ని
జ్యలఁ గావించిన దుర్లభ
మల నీచేఁ జూడఁ బడిన ♦ యట్టి ననుఁ గనన్. 47
గీ॥ వాస్తవముగ నిట్టి ♦ వాని నన్నుం జూచి
తెలిసికొనఁగ నన్నుఁ ♦ గలిసికొనఁగఁ
గోరువారలకును ♦ దారి యొక్కటి గల
దది యనన్యభక్తి ♦ యని యెఱుంగు. 48
ఉ॥ ఎవ్వఁడు సర్వకర్మముల ♦ నెప్పుడుఁ జేయు మదర్పణంబుగా
నెవ్వఁడు నన్నెకాని మఱి ♦ యెవ్వనిఁగోరక భక్తి సేయునో
యెవ్వఁడు సంగముం గెడపి ♦ యెల్లరఁ దన్నునె నిర్విరోధియై
యవ్వర వర్ణనీయసుగు ♦ ణాంబుధి సేరెడు నన్ను నర్జునా! 49

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసం
వాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున విశ్వరూపసందర్శన
యోగమను నేకాదశాధ్యాయము. 472

శ్రీ

# భగవద్గీతాశాస్త్రము.

## ద్వాదశాధ్యాయము.

గీ॥ సతతయుక్తులై యిట్లుపా ♦ సన మొనర్చు
భక్తులందును సత్పరా ♦ వ్యక్త నిన్నుఁ
దలఁచు ఘనులందు యోగవి ♦ త్తములఁ జెప్పు
మనుచు నర్జునుఁ డనఁ జనా ♦ ర్దనుఁడు నలికె. 1
గీ॥ మనసు నాయందు నెప్పుడు ♦ మగ్న పఱచి
నిత్యయుక్తులై కడు శ్రద్ధ ♦ నివ్వటిల్ల
నన్నుపాసించునట్టి మా ♦ నవులు యుక్త
తము లటంచును దలఁతు జి ♦ త్తమునఁ బార్థ! 2
సీ॥ ఇంద్రియంబుల నిగ్ర ♦ హించి మించిన సమ
బుద్ధి నెల్లప్పుడు ♦ భూతహితము
నొనరించు ననురక్తిఁ ♦ గని యనిర్దేశ్య మ
వ్యక్త మక్షర మచిం ♦ త్యంబు ధ్రువము
సర్వత్రగంబు చం ♦ చలముఁ గూటస్థంబు
నైన బ్రహ్మముఁ గొల్చు ♦ నట్టిఘనులు
నన్నుఁ జెందెద రొకింత ♦ తెలియు సందియము మాను
నవ్యక్త మానసక్తి ♦ నాత్మఁ గొలుచు

గీ॥ నట్టివారికిఁ గ్లేశము • లావహిల్లు
నపరిమితముగ నవ్యక్త • మయిన పథము
దేహవంతులచేతను • దీర్ఘదుఃఖ
ములను బొందంగఁ బడు నది • తెలియ వినుము. 3

మ॥ ఘనకర్మప్రతతిన్ మదర్పణముగాఁ
గావించుచున్ మత్పరుం
డనఁ బెంపొంది యనన్యయోగమున న
న్నశ్రాంతముం గొల్చుచున్
మనసు న్నాపయిఁ జేర్చు భక్తుని బిరా
నన్ మృత్యుసంసారవా
ర్ధిని దాటింపఁగ నుద్ధరింతు విను మ
ర్థిన్ బార్థ! ముమ్మాటికిన్. 4

క॥ మనసును స్థిరముగ నిలుపుచు
గొనకొని నాయందు బుద్ధి • గూడఁగ నిడినన్
గనియెద వటపై నైక్యం
బనుమానము లేక భారత • తా! నాలోనన్. 5

క॥ చిత్తము నిశ్చలవృత్తిన్
హత్తింప నశక్యమేని • యభ్యాసము నా
నుత్తమయోగంబున నను
నెత్తెఱఁగున నైన నిచ్ఛ • యింపుము చేరన్. 6

గీ॥ అట్టి యభ్యాసయోగము • నాచరింపఁ
గా నశక్తుండ వేని మ • త్కర్మపరుఁడ
వగుము కర్మములెల్ల మ • దర్థముగను
సలుపుచున్నను సిద్ధిఁ గాం • చంగఁ గలవు. 7

క॥ దీనిని గూడ నొనర్పుట
కైన నశక్తుండవేని ♦ యటుపిమ్మట స్వా
ధీనాత్మత మద్యోగముఁ
బూని విడువు సర్వకర్మ ♦ ముల ఫలము లొగిన్. 8

ఉ॥ జ్ఞానము శ్రేయ మభ్యసము♦కన్నను ధ్యానము మేలగుంజుమీ
జ్ఞానముకన్న ధ్యానమున ♦ కన్నను గర్మఫలంబులెల్లఁ దెం
పూని త్యజించుటెన్నఁ బర♦మోత్తమమై తనరారు నాపయి
మానుగ శాంతి చేకుఱుఁ బ్ర♦మంబుగఁ బొందునృపాలనందనా!

సీ॥ సర్వభూతములందు ♦ సదయుఁడై మిత్రభా
వముఁ జెంది ద్వేషలే ♦ శమును లేక
నిర్మమకారుఁడై ♦ నిరహంక్రియాత్ముఁడై
సమసుఖదుఃఖప ♦ శస్తిఁ దనరి
క్షాంతియు సంతత ♦ సంతుష్టియును యోగ
వృత్తియు యతమనో ♦ వృత్తి వెలయ
దృఢనిశ్చయుఁడు మద ♦ ర్పితమనోబుద్ధియు
మద్భక్తుఁ డగువాఁడు ♦ మత్ప్రియుండు

గీ॥ ప్రజలకును భీతిఁ గొలుపక ♦ ప్రజలవలన
భీతిఁ బొరయక మర్ష హ ♦ ర్షాతిశయము
భీతి నుద్వేగమును వీడి ♦ ఖ్యాతి మించి
వినుతిఁ గనువాఁడు నాకు ♦ ప్రియుఁడు పార్థ! 10

క॥ నిరపేక్షుండును దక్షుఁడు
ధరణి గతవ్యథుఁడు శుచి యు ♦ దాసీనుండున్
బరిహృతసర్వారంభుఁడు
వరభక్తుఁ డతండు నాకుఁ ♦ బరమప్రియుఁడౌ. 11

క॥ అలరక పగఁగొన కడలక
పలవక విడుచుచు శుభాశు ♦ భంబులు భక్తిన్
గలిగిన మహానుభావుఁడు
దెలియుము మత్ప్రియుఁ డటంచు ♦ దివిజేంద్రసుతా! 12

క॥ సమమిత్రశాత్రవుండున్
సమాన మానావమాన ♦ సమరసయుతుఁడున్
విముఖీకృతసంగుండును
సమశీతోష్ణసుఖదుఃఖ ♦ సమధికమతియున్. 13

క॥ సరిగా నిందాస్తుతులం
బరగుచు మునివృత్తిఁ దృప్తి ♦ వడి యెదియైనన్
స్థిరమతి వనికేతనుఁడై
వరభక్తుఁడు నరుఁడు నాకుఁ ♦ బరమప్రియుఁడౌ. 14

క॥ ఈనుడివిన ధర్మామృత
మూనిన శ్రద్ధను నుపాస్తి ♦ నొనరించెడు వా
రే నాకుఁ బరమభక్తులు
గా నధికప్రియులు గా నిఁ ♦ కన్ దలఁపు మెదన్. 15

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున భక్తియోగంబను ద్వాదశాధ్యాయము. 447

# శ్రీ

# భగవద్గీతా శాస్త్రము.

---

## త్రయోదశాధ్యాయము.

గీ॥ ప్రకృతి యనఁ బురుషుఁ డన క్షే ♦ త్ర మన నేమి?
యెవఁడు క్షేత్రజ్ఞుఁ డనఁబడు? ♦ నెద్ది జ్ఞాన?
మెద్ది జ్ఞేయంబు? నెఱుఁగఁగ ♦ నిశ్చయింతు
ననుచు నర్జునుతో జనా ♦ ర్దనుఁడు పలికె. 1

క॥ ఇద్దేహమె క్షేత్రంబన
నద్దాని నెఱుంగునట్టి ♦ ప్రాజ్ఞుని నెపుడున్
పెద్దలు క్షేత్రజ్ఞుని గాఁ
దద్దయు బేర్కొందు రిది య ♦ థార్థము పార్థా! 2

క॥ క్షేత్రజ్ఞుని గా సర్వ
క్షేత్రములం దెఱుఁగు నన్నుఁ ♦ జెలువగు క్షేత్ర
క్షేత్రజ్ఞజ్ఞానం బీ
ధాత్రిని జ్ఞానమని నామ ♦ తంబు కిరీటీ! 3

క॥ ఆల క్షేత్ర మెదియొ యెట్టిదొ
కలవే వికృతు లెవి దేని ♦ కతన నవ్వు నెవం
డిల క్షేత్రజ్ఞుఁడొ యేమహి
మలు కలఁడో దాని విను స ♦ మాసముగాఁగన్. 4

క॥ పలుగతుల ఋషులచేతన్
బలువిధవేదములచేతఁ ♦ బ్రత్యేకముగా
నల బ్రహ్మసూత్రపరముల
బలిష్ఠహేతువులచేత ♦ వర్ణింపఁబడెన్. 5

సీ॥ ధర వారి వహ్ని గం ♦ ధవహాంబరములను
నల మహాభూతంబు ♦ లయిదు మఱియుఁ
దగు నహంకారత ♦ త్త్వము బుద్ధియును మహ
త్తత్త్వ మవ్యక్త మన్ ♦ దనరు మాయ
జ్ఞానేంద్రియంబులు ♦ కర్మేంద్రియంబులు
పదియును మన మనం ♦ బరఁగు నొకఁడు
శబ్దాదులైన వి ♦ షయపంచకము చతు
ర్వింశతితత్త్వముల్ ♦ పేర్కొనంగ

గీ॥ నిచ్ఛ ద్వేషంబు సౌఖ్యంబు ♦ నేఁచుదుఃఖ
మవని దేహేంద్రియాదిసం ♦ హతియుఁ జేత
నమును ధృతియును దద్వికా ♦ రములు గూడ
క్షేత్రమని సంగ్రహంబుగఁ ♦ జెప్పఁబడియె. 6

సీ॥ తగ నమానిత్వ మ ♦ దంభిత్వము నహింస
క్షాంతి యార్జవము నా ♦ చార్యసేవ
స్థైర్యంబు శౌచంబు ♦ సంతతాత్మవినిగ్ర
హం బింద్రియార్థంబు ♦ లందు విరతి
నిరహంకృతియు జన్మ ♦ మరణజరావ్యాధి
తతదుఃఖదోషాను ♦ దర్శనంబు
సంగనాపుత్రగే ♦ హాదులందు నసక్తి
యును ననభిష్వంగ ♦ మొనసియుంట

గీ॥ చిత్తసమత నిష్టానిష్ట ♦ సిద్ధులందు
నన్ను ధ్యానించుచుంట న ♦ నన్యభక్తి
విరతి జనసంఘమందు వి ♦ విక్తసేవ
సంతతాధ్యాత్మికజ్ఞాన ♦ సంపదయును. 7

గీ॥ తత్వవిషయికజ్ఞానార్థ ♦ దర్శనంబు
నను నవియె జ్ఞాన మనఁగఁ బే ♦ ర్కొనఁగఁ బడును
దానికి విరుద్ధమయిన దం ♦ తయునుగూడఁ
దెలియు మజ్ఞాన మనుచుఁ గుం ♦ తీతనూజ! 8

గీ॥ తెలియఁదగినదెల్లఁ ♦ దెలిపెద నమృతంబు
దాన నీవు పొందఁ ♦ దగుదుచూవె
యది యనాదికలది ♦ యది పరబ్రహ్మంబు
సత్తు గాదు మఱి య ♦ సత్తు గాదు. 9

క॥ ఎల్లెడఁ గరములు చరణము
లెల్లెడ దృఙ్ముఖశిరంబు ♦ లెల్లెడఁ జెవులుక్
వెల్లివిరియ విలసిల్లుచు
నెల్లెడ వ్యాపించియుండు ♦ నీలోకములన్. 10

గీ॥ ఇంద్రియముల గుణాభాస ♦ మెసక మెసఁగి
తనరు సర్వేంద్రియవివర్జి ♦ తంబు నగుచు
సర్వము భరించుచుండు స ♦ సక్తమయ్యు
నిర్గుణంబయ్యు గుణము ల ♦ న్నియు భుజించు. 11

గీ॥ ప్రాణులకు లోన బయలఁ జ ♦ రాచరముగ
నిలిచి యుండియు సూక్ష్మతా ♦ వలనఁ దెలియ

దుస్తరంబగుచుండును ♦ దూరమందు
నుండియును నంతికమునఁ జె ♦ న్నొందుచుండు. 12

క॥ భూతములం దవిభక్తం
బై తోఁచి విభక్తముగను ♦ నగపడు భూత
వ్రాతముఁ బెంచు హరించును
భూతముల సృజించునంచు ♦ బుద్ధిఁ దెలియుమా. 13

క॥ అమరంగ దేజములకుఁ దే
జము తమమునకుం బరమ్ము ♦ జ్ఞానంబును జ్ఞే
యము నదియె జ్ఞానగమ్యము
సమస్తహృదయస్థమని ప్ర ♦ శంసింపఁబడున్. 14

క॥ క్షేత్రజ్ఞానజ్ఞేయము
లీత్రోవను సంగ్రహముగ ♦ నెఱిఁగింపఁబడెన్
ధాత్రి నిది తెలియు భక్తులు
పాత్రులు మద్భావ మందఁ ♦ బౌరవముఖ్యా! 15

గీ॥ ఆదిలేనివార ♦ లంచును బ్రకృతిని
బురుషు నీయిరువుర ♦ బుద్ధి నెఱుఁగు
ప్రకృతిసంభవములు ♦ పరికింప గుణములు
నల వికారములు పృ ♦ థాత్మజాత! 16

గీ॥ కార్యకారణకర్తృత్వ ♦ కరణమందుఁ
బ్రకృతి హేతువుగాఁ జెప్పఁ ♦ బడుచునుండుఁ
బురుషుఁ డెప్పుడు సుఖదుఃఖ ♦ ముల భుజింపఁ
గారణం బండ్రు విబుధులు ♦ వీరవర్య! 17

గీ॥ ప్రకృతియం దుండి పురుషుండు ♦ ప్రకృతివలనఁ
బొడము గుణముల ననుభవిం ♦ చెడును బార్థ!
యాతనికి గుణసంగంబె ♦ హేతువగును
బుణ్యపాపయోనులయందుఁ ♦ బుట్టుటకును. 18

క॥ పరగెడు నీదేహంబునఁ
బరుఁడైనట్టి పురుషుండు ♦ భర్తయన మహే
శ్వరుఁడన ననుమోదకుఁడనఁ
బరమాత్మయు భోక్తయన ను ♦ పద్రష్టయనన్. 19

క॥ ఈరీతిని గుణములతోఁ
జేరిన ప్రకృతిని నెఱింగి ♦ చెలువారెడు వా
రే రహి మెలంగుచుండిన
రారు జనన మంకఁగా మ ♦ రలఁ గౌంతేయా! 20

క॥ కొందఱు ధ్యానంబునఁ జె
న్నొందిన సాంఖ్యమునఁ గర్మ ♦ యోగముచేతన్
గొందఱు గని యెద రాత్మము
నం దాత్మను నాత్మ చేత ♦ నమరేంద్రసుతా! 21

క॥ మఱికొంద ఱివ్విధంబున
నెఱిఁగి తెలిసికొనఁగ లేక ♦ యితరులవలనన్
గఱపఁబడి శ్రుతిపరాయణ
గరిమన్ మృత్యువును దాటఁ ♦ గలుగుదు రనఘా! 22

క॥ ఇలను జరాచరములలో
వలఁ గించిద్వస్తువయినఁ ♦ బ్రభవిల్లును సు

మ్మల క్షేత్రక్షేత్రజ్ఞుల
కలయికచే నంచు నెఱుఁగఁ • గా నగుఁ బార్థా! 23

గీ॥ సర్వభూతంబులందును • సమతనుండు
నట్టి పరమేశ్వరుండు త • త్ప్రాణిసమితి
పొలిసిన నశింపఁడంచును • దెలిసికొన్న
వలఁతులే కద తెలిసిన • వారు పార్థ! 24

గీ॥ సమముగా నెల్ల భూతసం • ఘములయందు
నున్న యీశ్వరుఁ జూచుచు • నున్నయాతఁ
డాత్మహింసను దాను జే • యఁగఁ గడంగఁ
డందుచే నుత్తమపదంబు • నందు నతఁడు. 25

గీ॥ ప్రకృతిచేఁ గర్మములు సేయఁ • బడునటంచుఁ
దాన కర్త నటంచు సం • తతము సర్వ
విధముల గ్రహించునట్టి వి • వేకవంతుఁ
డే తెలిసినట్టివాఁడు కుం • తీతనూజ! 26

గీ॥ ఎపుడు భూతపృథగ్భావ • మేకదేశ
మందుఁ గని దాని విస్తార • మందువలన
నగునని యెఱింగినపుడె తా • నగును బ్రహ్మ
మనుచుఁ దెలియుము భరతవం • శాగ్రగణ్య! 27

గీ॥ అల యనాదియు నిర్గుణుం • డగుటవలన
నవ్యయుఁడు పరమాత్మ దే • హంబు నెప్పు
డాశ్రయించియుఁ గర్మంబు • లాచరింపఁ
డంటుకొండెదు భరతవం • శాగ్రగణ్య! 28

గీ॥ అంతటను నిండియుండిన • యాకసంబు
సూక్ష్మమగుటచే నంటని • చొప్పున నల
యాత్మ సర్వత్ర దేహము • నందు నుండి
యంటకుండెడు భరతవం • శాగ్రగణ్య! 29

గీ॥ ఇనుఁ డొకండయ్యు లోకము • లెల్ల మిగులఁ
దేజరిలఁ జేయునట్లు క్షే • త్రియును గూడ
క్షేత్రమును నెల్లఁ దాఁ బ్రకా • శింపఁ జేయు
ననుచుఁ దెలియుము భరతవం • శాగ్రగణ్య! 30

గీ॥ క్షేత్రమునకు క్షేత్రజ్ఞుని • కిఁ గలవాసి
ప్రకృతిచే భూతకోటులు • వడయు ముక్తి
జ్ఞానదృష్టిని గాంచు వి • చక్షణులకుఁ
బరము కరతలామలకమై • పరగుఁ బార్థ! 31

ఇది బ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగమను త్రయోదశాధ్యాయము. 478



శ్రీ

# భగవద్గీతా శాస్త్రము.

## చతుర్దశాధ్యాయము.

గీ॥ జ్ఞానములలోన నుత్తమ ♦ జ్ఞాన మేను
మఱియు నుపదేశ మొనరింతు ♦ మౌనులెల్ల
దీనిచే నింతకన్న ను ♦ త్కృష్టగతిని
గాంచిరని ఫల్గునునితో వ ♦ చించె శౌరి. 1

క॥ విను మిట్టిజ్ఞానమును గై
కొని మత్సాధర్మ్య మందు ♦ కోవిదవర్యుల్
జనియింపరు సర్గంబునఁ
గన రేదుఃఖంబుఁ బ్రళయ ♦ కాలమునందున్. 2

గీ॥ యోని నాద్యప్రకృతి ♦ యుంచుచు నున్నాఁడ
గర్భ మందులోనఁ ♦ గాన దాన
సర్వభూతసమితి ♦ సంభవం బగుచుండు
భరతవంశముఖ్య! ♦ వలయుఁ దెలియ. 3

గీ॥ అనుమహద్బ్రహ్మ మే తల్లి ♦ యఖిలయోను
లందు సంభవమగు మూర్తు ♦ లన్నిటికిని
నేను బీజప్రదాతనై ♦ నెగడుచున్న
తండ్రినంచుఁ దలంపు పృ ♦ థాతనూజ! 4

గీ॥ సత్వము రజంబు తమమను ♦ సంజ్ఞ లెసఁగి
పరగు గుణములు ప్రకృతిసం ♦ భవములగుచు
నవ్యయుండగు దేహి దే ♦ హంబునందు
బద్ధునిగఁ జేయుచున్నవి ♦ పాండుతనయ! 5

గీ॥ సత్వగుణ మందులో నిర్మ ♦ లత్వమున న
నామయంబై ప్రకాశకం ♦ బై తనర్చు
సరవి సుఖసంగమున జ్ఞాన ♦ సంగమునను
బంధన మొనర్చు దేహిని ♦ బాండవేయ! 6

గీ॥ రాగరూపకమైన ర ♦ జోగుణంబు
చర్చసేయఁ దృష్ణాసంగ ♦ సంభవంబు
గా నెఱుంగుము దేహిని ♦ గర్మసంగ
మునను బంధించు నది కురు ♦ ముఖ్య! వింటె. 7

క॥ తెలియఁగఁ దగు నజ్ఞానము
వలనఁ దమోగుణము సంభ ♦ వంబని యది దే
హులను బ్రమాదాలస్యం
బుల నిద్రామోహపాశ ♦ ముల బంధించున్. 8

గీ॥ సౌఖ్యసంగము గలిగించు ♦ సత్వగుణము
గలుగఁ జేయును గర్మసం ♦ గము రజంబు
మహిని జ్ఞానముఁ గప్పి ప్ర ♦ మాదమందుఁ
గూర్చుచుండు నహో తమో ♦ గుణము పార్థ! 9

గీ॥ సత్వము రజస్తమంబులఁ ♦ జక్కడంప
రజము సత్వతమములఁ ది ♦ రస్కరింపఁ
దమము సత్వరజస్సులఁ ♦ దలఁగఁ ద్రోయఁ
బొడము నంచు గ్రహింపుము ♦ పురుషవర్య! 10

గీ॥ ఈశరీరములోపల • నెల్లద్వార
ములను జ్ఞానప్రకాశ మె • ప్పుడుc జెలంగు
నప్పుడే సత్త్వము ప్రవృద్ధ • మయ్యె ననుచుc
దెలిసికొనఁదగుc జూవె కుం • తీతనూజ! 11
గీ॥ లోభముc బ్రవృత్తిc గర్మముల్ • పొనరుచుటయు
మొదలు వెట్టుటయును శమం • బును దొఱఁగుట
తృష్ణయు జనింప రజ మభి • వృద్ధినైన
గుఱుతులనుచు నెఱుంగుము • కురువరేణ్య! 12
గీ॥ అప్రవృత్తి మోహ • మప్రకాశప్రమా
దములు పుట్టుచుండుc • దమము వృద్ధిc
జెందఁగా నటంచుc • జిత్తమందుc దలంపు
భరతవంశముఖ్య! • పాండుతనయ! 13
గీ॥ సత్త్వగుణము వృద్ధి • సంధించునప్పుడు
మరణ మొందునట్టి • మానవుండు
బ్రహ్మవేత్తలందు • పరిశుద్ధలోకంబు
లందఁగలరు చూవె • యనఘచరిత! 14
గీ॥ రజము వృద్ధిని గనువేళc • బ్రళయమందు
జనులు జన్మించెదరు కర్మ • సంగులగుచుc
దమము వృద్ధిని గాంచెడు • తరిని జచ్చు
మానవులు పుట్టుదురు మూఢ • యోనులందు. 15
గీ॥ సుకృతకర్మఫలం బెన్న • శుద్ధసాత్త్వి
కము రజోగుణఫలము దుః • ఖము తమోగు
ణఫల మజ్ఞాన మందురి సు • జ్ఞానులెల్ల
భవ్యసద్గుణసముదాయ! • పాండవేయ! 16

గీ॥ సత్వగుణమువలన ♦ జ్ఞానంబు లోభంబు
రజమువలనఁ దమము ♦ ప్రజ్వరిలిన
మోహమును బ్రమాద ♦ మును నవివేకంబుఁ
గలుగుచుండు నంచుఁ ♦ దెలియుమయ్య! 17

గీ॥ ఊర్ధ్వమునకు నేగు ♦ చుందురి సత్వస్థులు
నిలుచుచుందురి రాజ ♦ సులు నడుమను
దామసులకుఁ బోవు ♦ తా వధోలోకంబు
హీనవృత్తి గుణవి ♦ హీనులగుట. 18

క॥ విను గుణములకన్నను న
న్యుని గర్తగ ద్రష్టయై క ♦ నుంగొనక సదా
గొనములకుం బరునిగఁ గను
ఘనుఁ డే మద్భావమందఁ ♦ గలఁడు కిరీటీ! ·19

గీ॥ దేహి దేహసముద్భవ ♦ త్రిగుణములను
దాఁటి జన్మజరామృత్యు ♦ దుఃఖసమితి
చే విముక్తుండు నగుచు మిం ♦ చినను మోక్ష
మందఁగా వచ్చు భరతవం ♦ శాగ్రగణ్య! 20

క॥ ఏతత్త్రిగుణాతీతుని
కేతీరగు గుఱుతు లుండు? ♦ నే నడువడులా?
నేతత్త్రిగుణంబుల నే
రీతి నతఁ డతిక్రమించుఁ? ♦ గృష్ణా! శౌరీ! 21

సీ॥ అని యిట్టు లడిగిన ♦ యర్జునుఁ గనుఁగొని
భగవంతుఁడగు శౌరి ♦ పలికె నిట్లు
సంప్రాప్తమగు ప్రకా ♦ శప్రవృత్తులను మో
హమును ద్వేషింపక ♦ సమసినట్టి

వానిఁ గోరక యుదా • సీనుచందాన నా
సీనుఁడై గుణముల • చే నొకింత
చలనమందక గుణం • బులు ప్రవర్తిల్లెడు
నంచుఁ దాఁ గదల కు • న్నట్టియతఁడు
గీ॥ తుల్యదుఃఖసుఖుండు స్వ • స్థుఁడు సమప్రి
యాప్రియుఁడు తుల్యలోష్టాశ్మ • హాటకుండు
ధీరుఁడు సమాననిందాస్తు • తియు సమాన
మహితమానావమానస • మ్మతుఁడు మఱియు. 22
క॥ తులితహితాహితపక్షో
జ్వలచేతస్కుండు త్యక్త • సర్వారంభుం
డలరు గుణాతీతుండన
వెలయు నతఁడు సంతతంబు • విబుధులు మెచ్చన్. 23
గీ॥ కదలకున్నట్టి భక్తియో • గంబువలన
నన్ను సేవించుచున్నట్టి • సన్నుతుండు
దా గుణాతీతుఁడై సమ • ర్థత వహించు
బ్రహ్మభావంబు వడయంగఁ • బోండవేయ! 24
గీ॥ అవ్యయామృతమైన బ్ర • హ్మంబునకును
మహిని శాశ్వతమైన ధ • ర్మంబునకును
నరయ నైకాంతికాతిసౌ • ఖ్యంబునకును
నాశ్రయుఁడ నేన చూవె స • వ్యసాచి! 25

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున గుణత్రయ విభాగ యోగమను చతుర్దశాధ్యాయము. 503



# భగవద్గీతా శాస్త్రము.

## పంచదశాధ్యాయము.

గీ॥ మొదలు మీఁది కథోభాగ ♦ మునకుఁ గొమ్మ
లలరు నశ్వత్థ మవ్యయం ♦ బనెడు శ్రుతులు
దాని యాకులు ఛందముల్ ♦ దాని నెఱుఁగు
నతఁడె వేదవిదుం డని ♦ హరి వచించె. 1

గీ॥ దానిశాఖలు గుణములఁ ♦ దద్దఁ బెఱిగి
విషయపల్లవములు గల్గి ♦ విస్తరిల్లెఁ
బైకిఁ గ్రిందికిఁ గర్మాను ♦ బంధములగు
మూలములు క్రింది నరలోక ♦ మునకుఁ బర్వె. 2

గీ॥ దానిరూపంబు తుదమొదల్ ♦ దానియునికి
నిట నెఱుంగుట దుష్కర ♦ మింతవట్టు
వేళ్ళువారిన యశ్వత్థ ♦ వృక్షమును న
సంగదృఢశస్త్రమున నరు ♦ కంగవలయు. 3

గీ॥ ఆ వెనుక నెందుఁ జేరి న ♦ బైన మరల
రాదొ యెవ్వానివలనఁ బు ♦ రాణియగు ప్ర
వృత్తి ప్రసరించె నయ్యాద్యు ♦ నిద్ధపురుషుఁ
గాంతు నని తత్పదము వెదు ♦ కంగవలయు. 4

క॥ జితసంగులు సువివేకులు
హతమానవిమోహకాము ♦ లధ్యాత్మరతుల్
గతసుఖదుఃఖద్వంద్వులు
నతులితగతిఁ గాంచువార ♦ లవ్యయపదమున్. 5

క॥ దేనిని దినకరచంద్రకృ
శానులు వెలిగింపఁగాన ♦ శక్తులో మరలం
గా నేర రెద్దిచేరిన
దానినెఱుఁగు నాదు పరమ ♦ ధామము గాఁగన్. 6

గీ॥ అల సనాతనమైన మ ♦ దంశ మెన్న
జీవలోకములో జీవుఁ ♦ డై వెలయుచుఁ
బ్రకృతి నెలకొని మనసె యా ♦ ఱవదిగాఁ జె
లంగు నింద్రియములనెల్ల ♦ లాగుచుండు. 7

గీ॥ ఎప్పు డీశరీర ♦ మీశ్వరుండు ధరించు
నేశరీర మాతఁ ♦ డెపుడు విడుచు
నపుడు గంధవాహుఁ ♦ డాశయమందుండి
తావి తేవఁ గొంచుఁ ♦ బోవు వీని. 8

క॥ వినుమీ జీవుఁడు శ్రోత్రం
బును ద్వక్కును రసనఁ జక్షు ♦ వును ఘ్రాణంబున్
మనసు నధిష్ఠించుచుఁ దా
ననయము సేవించుచుండు ♦ నవ్విషయములన్. 9

క॥ వెడలి చనుచున్న నిలిచినఁ
గుడుచుచు నున్న గుణములను ♦ గూడిన నతనిన్
బొడఁగానలేరు మూఢులు
పొడఁగాంతురు జ్ఞానచక్షు ♦ వులు కౌంతేయా! 10

గీ॥ ఆత్మయందు వసించు చు • న్నట్టివాని
యోగులు ప్రయత్నమునఁ జూచు • చుందు రతని
యత్నము లొనర్చియును నకృ • తాత్ములైన
బుద్ధిహీనులు గానరు • పురుషముఖ్య! 11

క॥ ఆదిత్యగతంబై జగ
మేది ప్రకాశింపఁజేయు • నిందుదహనులం
దేదివ్యతేజ మలరు నె
నాదియనుచు దాని నర్జు • నా! తెలియఁ దగున్. 12

గీ॥ వసుధ నేను ప్రవేశించి • బలిమికలిమి
భూతములను ధరింతును • గొలుపుమీఱ
నల రసాత్మకుఁడౌ సోముఁ • డై తనర్చి
యోషధులనెల్లఁ బోషించు • చుందుఁ బార్థ! 13

గీ॥ ఏన వైశ్వానరుండనై • యీసమస్త
ప్రాణికోటుల దేహంబు • లాశ్రయించి
నాలుగు తెఱంగులైన య • న్నమును బక్వ
ముగ నొనర్తుఁ బ్రాణాపాన • ములను గూడి. 14

ఉ॥ అందఱి డెందమందు నన • యంబు వసించెద నాకతంబునన్
బొందుగ జ్ఞానమున్ స్మృతి న • పోహనమున్ సమకూరు లోకమె
న్నందగు వేదవేద్యుఁడ నే • నచ్చితినే నిగమాంతముల్ సుధీ
బృందము మెచ్చఁగా శ్రుతుల • నెల్ల నెఱింగిన ప్రోడఁ గవ్వడీ! 15

క॥ క్షరుఁ డక్షరుఁ డను నిరువురు
పురుషులు లోకమునఁ గలరు • భూతము లెల్లన్
క్షరసంజ్ఞఁ బరఁగుఁ దగు న
క్షరుఁ డనఁ గూటస్థుఁ డొకఁడె • కౌరవముఖ్యా! 16

క॥ పరమాత్మ యనంగ వేఱొక
పురుషుం డుత్తముఁడు కలఁడు ♦ ముల్లోకములన్
భరియించుఁ జొచ్చి యతఁ డీ
శ్వరుఁ డవ్యయుఁ డనుచుఁ జెప్పఁ ♦ బడుఁ గౌంతేయా! 17

క॥ క్షరున కతీతుఁడనై య
క్షరుకన్నను నుత్తముఁడను ♦ గావున నేనే
పురుషోత్తముఁ డన నెగడితిఁ
బరమామ్నాయముల లోక ♦ పటలమునందున్. 18

గీ॥ మోహమును దొఱంగి ♦ పురుషోత్తముని గాఁగ
నన్ను నట్లు తెలిసి ♦ కొన్న యతఁడె
యఖిలమును నెఱుంగు ♦ నతఁడు నన్ను భజించు
వలఁతి చూవె సర్వ ♦ భావములను. 19

క॥ అతిగుహ్యశాస్త్ర మిది సె
ప్పితి దీనిని నెఱిఁగినట్టి ♦ వేత్తలు చూవే
కృతకృత్యులైనవారలు
మతిమంతు లనంగఁబరఁగు ♦ మాన్యులు పార్థా! 20

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబునఁ బురుషోత్తమప్రాప్తియోగమను పంచదశాధ్యాయము. 523



# భగవద్గీతాశాస్త్రము.

## షోడశాధ్యాయము.

సీ॥ భగవంతుఁ డిట్లను ♦ భయము లేకుండుట
సత్వసంశుద్ధియు ♦ జ్ఞానయోగ
మందుండుటయు దాన ♦ మాచరించుటయును
దమము యజ్ఞంబు స్వా ♦ ధ్యాయతపము
లార్జవాక్రోధన ♦ త్యాహింసలును ద్యాగ
మును శాంతియును నపై ♦ శునము భూత
దయ నలోలత్వ మా ♦ ర్దవములు హ్రీయు న
చాపల తేజముల్ ♦ క్షమయు ధృతియు

గీ॥ శౌచ మద్రోహము నిగర్వ ♦ సౌమనస్య
మనెడు శుభలక్షణములచే ♦ నలరుచుండు
దైవియను సంపదను బొందఁ ♦ దగ జనించు
నట్టిఘనులకు భరతనం ♦ శాగ్రగణ్య! 1

గీ॥ దంభ మభిమాన మజ్ఞాన ♦ దర్పములును
గ్రోధపారుష్యము లను దు ♦ ర్గుణములెల్ల
ననురసంబంధసంపద ♦ లనుభవింపఁ
బుట్టువారల కలవడుఁ ♦ బురుషవర్య! 2

గీ.॥ దైవసంపద దొలఁచు బం ♦ ధముల నెల్ల
నసురసంపద బంధము ♦ లందఁ జేయు
దైవసంబంధసంపదల్ ♦ దాల్చి నీవు
పుట్టితివి కాన శోకింపఁ ♦ బోకు మింక. 3

క॥ ఇల రెండు భూతసర్గం
బులు దైవం బాసుర మని ♦ పొలుపొందెడు మున్
దెలిపితి దైవము నంతయుఁ
దెలిపెద నాసురము నిపుడు ♦ దివిజేంద్రసుతా! 4

క॥ తెలియఁగ లే రసురజనుల్
వెలయు ప్రవృత్తియు నివృత్తి ♦ విశదముగా వా
రలయందుఁ గలుగ వెన్నఁడు
నల సత్యము శౌచవృత్త ♦ మాచారంబున్.

గీ॥ జగ మసత్యంబు నప్రతి ♦ ష్ఠం బనీశ్వ
రంబు నపరస్పరప్రభ ♦ వంబు కాక
యన్య మేమున్న దిఁకఁ గామ ♦ హైతుకంబె
యంచుఁ బల్కుచునుందురు స ♦ మ్యగ్విచార! 6

గీ॥ అట్టి దృష్టి గలిగి ♦ నట్టి నష్టాత్ములే
యహితు లుగ్రకర్మ ♦ లల్పబుద్ధు
లక్కటా జగత్క్ష ♦ యార్థంబు పుట్టుచు
నుందు రనుచుఁ దెలియు ♦ మో కిరీటి! 7

ఉ॥ వారవిరామకామమున ♦ వర్తిలుచు న్మదమానదంభవి
స్తారులు దుష్పరిగ్రహణ ♦ తత్పరులై యశుచివ్రతాఢ్యులై

ధారణిఁ గామభోగము లెందుం బరమార్థముగాఁ దలంచుచున్
దీఱని చింతఁ గూలుదురు • నిశ్చయమం చిది చచ్చునంతకున్.

గీ॥ ఆశలనియెడుపాశంబు • లంటఁ గట్టఁ
గ్రోధమును గామమును గల్గి • కోర్కు లెల్ల
ననుభవింపఁగ నర్థ మ • న్యాయవృత్తి
నార్జన మొనర్పఁ గోరుదు • రనఘచరిత! 9

క॥ ఇప్పుడు నా కిది చేకుఱెఁ
దప్పకయగు నీమనోర • థము కలుగుఁజుమీ
కుప్పగ నిది వెండియునుం
జొప్పడు నీధన మటంచుఁ • జొక్కుచు నుండున్. 10

క॥ పరిమార్చితి నీశత్రునిఁ
బరిమార్పఁగ నేర్తు నితర • వైరివరుల నీ
శ్వరుఁడ సుఖ భోగి సిద్ధుఁడ
ధర బలవంతుఁడ నటంచుఁ • దలఁచుచునుండున్. 11

క॥ నే నాఢ్యుండఁ గులీనుఁడఁ
దా నెవ్వం డీడు నాకు • దాన మొనర్తున్
నే నొనరించెద జన్నము
లానందించెద నటంచు • నని యెద రజ్ఞుల్. 12

గీ॥ వివిధముగను జిత్త • విభ్రాంతి నొందుచు
మోహజాలమందు • మునిఁగిపోయి
కామభోగములను • గాలంబు పుచ్చుచు
ఘోరనరకములను • గూలుదురు. 13

గీ॥ తమ్ముఁ బొగడుకొనుచు ♦ స్తబ్ధులై ధనమాన
మదసమన్వితులయి ♦ మంచిపేరుఁ
గోరి జన్నములను ♦ భూరిదంభమునకై
యవిధిపూర్వకముగ ♦ నాచరింతురు. 14

క॥ బలదర్పాహంకారం
బులు కామక్రోధములు ర ♦ వుల్కొనఁ దమలో
పల నన్యదేహములలో
పలఁ గల నాయందు ద్వేష ♦ పడుదు రసూయన్. 15

క॥ క్రూరులు నశుభులు మద్వే
షారంభులు నైన యీ న ♦ రాధములను సం
సారముల నసురయోనుల
సారెకుఁ ద్రోసెదను నే న ♦ జస్రము పార్థా! 16

గీ॥ అసురయోనులందు ♦ నట్లు పుట్టినవారు
జన్మజన్మములను ♦ సంకటపడి
మూఢులగుట కాక ♦ పొందఁజాలరు నన్ను
నధమగతిని గాంతు ♦ రంతకన్న. 17

క॥ విను క్రోధకామలోభము
లను మూడును నరకమునకు ♦ నై తెరువులు, నా
శన మాత్మకుఁ జేయును గా
వున నీమూ డీవు విడువు ♦ పురుషవతంసా! 18

క॥ ఈమూడు తమోద్వారము
లే మనుజుఁడు విడుచు నాతఁ ♦ డే తన కెపుడుం

దా మేలు సేసికొనుచు న
దా మోక్షముఁ గాంచెడున్ గ ♦ దా కౌంతేయా! 19

గీ॥ శాస్త్రవిధుల మీఱి ♦ సంతత స్వేచ్ఛాను
సారియై యెవండు ♦ సంచరించు
నతఁడు సిద్ధిఁ గాంచఁ ♦ డందఁడు సౌఖ్యంబు
పరమగతియుఁ దుదకుఁ ♦ బడయ లేఁడు. 20

క॥ అదిగావునఁ జేయందగి
నది సేయఁగరాని దాని ♦ ననుశాసింపం
గద శాస్త్రంబు ప్రమాణం
బిది లెస్స యెఱింగి చేయు ♦ మీ కర్మంబుల్. 21

ఇది బ్రహ్మవిద్యా యోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీ భగవద్గీతోపనిషదంబున దైవాసురసంపద్విభాగ యోగమను షోడశాధ్యాయము. 544





# భగవద్గీతా శాస్త్రము.

## సప్తదశాధ్యాయము.

గీ॥ శాస్త్రవిధులమీఱి • శ్రద్ధతో జన్నంబు
సేయువారి నిష్ఠఁ • జెప్పు మెదియొ
సాత్త్వికంబొ రాజ • సమొ తామసంబొకో
యనుచు నడుగు క్రీడి • కనియె శౌరి. 1

గీ॥ ప్రాణిసంఘంబునకు స్వభా • వమునఁ జేసి
శ్రద్ధ మూఁడువిధంబులై • సాగుచుండు
ధరణి సాత్త్వికి రాజసి • తామసియనఁ
దెలిపెదను వాని వినుము కుం • తీతనూజ! 2

గీ॥ ప్రాణులకునెల్ల శ్రద్ధ స • త్త్వానురూప
మగుటవలన శ్రద్ధామయుఁ • డగును బురుషుఁ
డాతనికి మున్ను సమకూడి • నట్టి శ్రద్ధ
కనుగుణంబుగ శ్రద్ధాళు • వగు నతండు. 3

క॥ పూజింతురు సాత్త్వికులు సుర
రాజని రాజసులు యక్ష • రాక్షసతతులం
బూజింతురు తామసు లిలఁ
బూజించుచు నుందురు భూత • ములఁ బ్రేతములన్. 4

క॥ డంబ మహంకారము కా
మంబును రాగము బలంబు ♦ మల్లడిగొను డెం
దంబులుగల జను లుగ్రత
పం బొనరించుచును శాస్త్ర ♦ వైరుధ్యముగన్. 5

సీ॥ దేహమందున్న భూతస ♦ మూహములను
నన్ను నంతశ్శరీరమం ♦ దున్నవాని
సన్నగిలఁ జేయు నవివేకు ♦ లెన్నఁబడుదు
రసురనిశ్చయులనుచు స ♦ వ్యసాచి! 6

క॥ వినుమాహారము త్రివిధము
గను బ్రియమగు సర్వభూత ♦ గణమున కాచా
ప్పున నే యజ్ఞమ్మును దప
మును దానము వానిభేద ♦ మును వినిపింతున్. 7

గీ॥ ఆయురారోగ్యబలసౌఖ్య ♦ హర్ష సత్త్వ
వర్ధనస్నిగ్ధముల్ రస ♦ వంతములును
హృద్యములును దిరంబులై ♦ యెన్నికలను
గన్న యాహారములు సాత్త్వి ♦ కప్రియములు. 8

గీ॥ కరముఁ జేదును బులుసును ♦ గార ముప్పు
గరము వేఁడిమి దాహంబుఁ ♦ గలిగి ద్రవము
లేనివై శోకదుఃఖము ♦ లీనునట్టి
భోజనంబులు ప్రియములు ♦ రాజసులకు. 9

గీ॥ జాము గడచిన దైగస ♦ మేమి లేక
కంపునింపుచు నుచ్ఛిష్ట ♦ కలితి మగుచుఁ

బర్యుషితమై యమేధ్యమై • పరఁగు భోజ
నంబు తామసులకును బ్రి • యంబు పార్థ! 10

క॥ ఫలకాంక్షలేక యజ్ఞం
బల శాస్త్రోక్తముగఁ జేయు • టర్హంబని కే
వలచేతోనిశ్చలతన్
జలిపిన యజ్ఞంబు బరఁగు • సాత్త్విక మనఁగాన్. 11

క॥ కోరికచే దంభార్థం
బారంభించి యొనరించు • యజ్ఞము లెల్లన్
ధారుణి రాజసయజ్ఞము
లై రాజిలుచుండుఁ గురుకు • లాగ్రణి! వింటే. 12

గీ॥ మంత్రహీనమగుచు • మఱి విధిహీనమై
యన్నదానహీన • మై యదక్షి
ణముగ శ్రద్ధలేకొ • నర్చెడు యజ్ఞంబు
తామసంబనంగఁ • దనరుచుండు. 13

గీ॥ భూసురప్రాజ్ఞగురుదేవ • పూజనంబు
శౌచ మార్జవమును బ్రహ్మ • చర్యవృత్తి
తగ నహింసయు శారీర • తపము లండ్రు
భవ్యసద్గుణసముదాయ! • పాండవేయ! 14

క॥ హితమై ఋతమై ప్రియమై
యితరులకును నొప్పి దవుల • నీయని పలుకుల్
శ్రుతు లధ్యయనము సేయుట
క్షితి వాఙ్మయతపమటంచుఁ • గీర్తింపఁబడున్. 15

గీ॥ మౌనము మనఃప్రసాదసౌ ♦ మ్యత్వగరిమ
భావసంశుద్ధి యాత్మ స ♦ దా వినిగ్ర
హంబు మానసికం బౌ త ♦ పం బటంచుఁ
బండితులు వల్కుచుందురు ♦ పాండవేయ! 16

క॥ ఫలకాంక్ష లేని యోగీం
ద్రులు భక్తిఁ దనర్చు శ్రద్ధ ♦ తో మూఁడువిధం
బులు గలిగిన నీతపమును
సలిపినచోఁ దానినండ్రు ♦ సాత్త్విక మనుచున్. 17

క॥ గౌరవముం బూజాస
త్కారముఁ గన డంబమునకుఁ ♦ గావించు తపం
బౌరయ నధ్రువ మచలం
బై రాజసమనఁగఁ బరఁగు ♦ నమలవిచారా! 18

గీ॥ ఆత్మపీడతోడ ♦ నవివేకపుంబట్టు
దలను బరులఁ జెరుపఁ ♦ దలఁచి చేయఁ
బడిన తపము చెప్పఁ ♦ బడును దామస మని
ప్రధనసజైత్ర! పాండు ♦ రాజపుత్ర! 19

గీ॥ దేశకాలపాత్రంబులు ♦ తెలిసి యనుప
కారి కీయంగఁ దగునని ♦ కడఁగి చేయు
దానమే సాత్త్వికంబని ♦ తలఁపఁ బడును
భవ్యసద్గుణసముదాయ! ♦ పాండవేయ! 20

గీ॥ ఫలమపేక్షించుటనుగాని ♦ ప్రతిఫలోప
కృతినిమిత్తముచేఁగాని ♦ క్లేశవృత్తి

సలుపఁబడు దానమే రాజ ♦ సం బటంచుఁ
దలఁపఁబడుచున్నయది పురం ♦ దరకుమార! 21

గీ॥ క్షమ సకాలంబునం దదే ♦ శంబునం ద
పాత్రుల కసత్కృపాగౌర ♦ వంబు గాఁగఁ
జేయఁబడునట్టిదానంబు ♦ చెల్లుచుండుఁ
దామసం బన నెపుడు సు ♦ త్రామపుత్ర! 22

క॥ ఓం తత్సత్తని బ్రహ్మం
బెంతయు నిర్దిష్టమయ్యె ♦ నిలఁ ద్రివిధంబై
యంతట విప్రశ్రుతిమఖ
సంతానము పుట్టె మున్ను ♦ చర్చింపంగన్. 23

గీ॥ కాన దానయజ్ఞ ♦ కర్మతపంబుల
శాస్త్రరీతిచేత ♦ సలుపునపుడు
బ్రహ్మవాదులెల్లఁ ♦ బ్రణవంబు ముందుగా
నుచ్చరించుచుందు ♦ రో కిరీటి! 24

క॥ విను తచ్ఛబ్దము నుడువుచు
మునుకొన ఫలరహితముగ ము ♦ ముక్షువులు తపం
బును దానంబును యజ్ఞం
బును మొదలగు క్రియలు సతత ♦ ము నొనర్తు రిలన్. 25

గీ॥ సాధుభావమందు ♦ సద్భావమందు నీ
సత్పదప్రయోగ ♦ సరణి చెల్లు
నందుచేఁ బ్రశస్త ♦ మగు కర్మములయందు
సత్పదోపపతి ♦ సముచితంబు. 26

గీ॥ యజ్ఞదానతపస్సుల ♦ యందలిస్థితి
సత్తని జగత్ప్రసిద్ధవ ♦ శస్తిఁగాంచె
నందుచేతఁ దదర్థీయ ♦ మైనకర్మ
మెన్నఁబడు సత్తటంచు సు ♦ రేంద్రతనయ! 27

క॥ విను శ్రద్ధలేని హోమం
బును దానంబును దపంబు ♦ మొదలగు పనులె
ల్ల నసత్తనఁబడు విఫలము
లని తలఁపుము వాని నిందు ♦ నందుఁ గిరీటీ! 28

ఇది శ్రీబ్రహ్మవిద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీభగవద్గీతోపనిషదంబున శ్రద్ధాత్రయవిభాగయోగమను సప్తదశాధ్యాయము. 572



శ్రీ

# భగవద్గీతాశాస్త్రము.

---

## అష్టాదశాధ్యాయము.

గీ॥ త్యాగసన్న్యాసముల యథా ♦ ర్థమును వేఱు
వేఱ నెఱుఁగంగఁ గోరుదు ♦ వేదవేద్య!
కాన దయచేసి తెలుపుము ♦ కంసవైరి!
యనుచు నర్జునుతో జనా ♦ ర్దనుఁడు పలికె. 1

గీ॥ కవివరు లెఱుంగుదురు కామ్య ♦ కర్మసమితి
న్యాసమొనరించు టన్న స ♦ న్న్యాసమంచు
సర్వకర్మఫలత్యాగ ♦ ముర్విలోనఁ
ద్యాగమందురు విచక్షణుల్ ♦ హరికుమార! ౨

క॥ కొందఱు ప్రాజ్ఞులు దోషము
లందిన కర్మమ్ముఁ ద్యాజ్య ♦ మనియెద రింకం
గొందఱు విడువంగాఁ దగ
దందురు మఖదానతపము ♦ లను కర్మంబుల్. 3

గీ॥ త్యాగమన్నను నానిశ్చ ♦ యంబు వినుము
త్రివిధముగ నున్న దది ప్రకీ ♦ ర్తింపఁబడియెఁ
గర్జములు దానమఖతపః ♦ కర్మము లవి
విడువఁదగవు పవిత్రముల్ ♦ విబుధులకును. 4

క॥ ఫలసంగవిరహితముగా
సలుపఁగఁదగు నీ సమస్త ♦ సత్కర్మంబుల్
తలతు నిది నిశ్చితము కే
వల ముత్తమ మనుచు భరత ♦ వంశాభరణా! 5

గీ॥ మానఁగా రాదు నియతక ♦ ర్మంబు లెపుడు
వాని నవివేకవశమున ♦ వదలెనేని
తామసత్యాగమందురు ♦ ధాత్రిలోన
భవ్యసద్గుణసముదాయ ♦ పాండవేయ! 6

క॥ కాయక్లేశము దుఃఖము
గాయని కర్మముఁ ద్యజింపఁ ♦ గా రాజసమం
బై యాతని త్యాగమును గాం
తేయా! త్యాగఫల మాత ♦ నికి దుర్లభ నరా. 7

గీ॥ కర్తవ్యమంచు నియతా ♦ కర్మంబు సంగంబు
ఫలము విడిచి చేయఁ ♦ బడిన యప్పు
డట్టి త్యాగ మెన్న ♦ నగు సాత్త్వికంబని
నామతిమున దివిజ ♦ నాథతనయ! 8

గీ॥ సత్త్వగుణసమయుతుండును భిన్న ♦ సంశయుండు
త్యాగి మేధావి యకుశల ♦ మైనకర్మ
ములనొనర్ప ద్వేషింపఁడు ♦ కుశలకర్మ
ములకు నాసక్తిఁ జెందఁడె ♦ ప్పుడు కిరీటి! 9

గీ॥ సకలకర్మములఁ ద్యజింప ♦ శక్యమగునె
దేహధారుల కెన్న ధా ♦ త్రీతలమునఁ
ద్యాగియంచును బేర్కొనఁ ♦ బడినవాఁడెఁ
డరయఁ గర్మఫలత్యాగి ♦ యగును బార్థ! 10

గీ॥ కర్మఫలము ముత్తెఱంగులు ♦ గలది యిష్ట
మును ననిష్టము మిశ్రమం ♦ చును ధరిత్రి
విడువ దత్త్యాగులను మేను ♦ విడచె నేని
యెనయ దెన్నఁడు సన్న్యాసు ♦ లను గిరీటి! 11

గీ॥ సర్వకర్మసిద్ధి ♦ సమకూరుటకును సి
ద్ధాంతమైనసాంఖ్య ♦ మనెడుశాస్త్ర
మందుఁ దెలుపఁబడిన ♦ యైదుకారణములు
దెలుపువాఁడ నీకుఁ ♦ దేటపడఁగ. 12

గీ॥ విను మధిష్ఠానమును గర్త ♦ యును బృథగ్వి
ధంబులగు కరణములుఁ బృ ♦ థగ్విధంబు
లైన చేష్టలు నందుండు ♦ నైదవదగు
దైవమును గారణములంచుఁ ♦ దగి నెఱుంగు. 13

క॥ మానసవాక్కాయంబుల
మానవుఁ డిల న్యాయమైన ♦ వఁతి విపరీతం
బైనను గర్మ మొనర్పన్
దానికి నీయైదుకార ♦ ణములు కిరీటీ! 14

గీ॥ అట్టులగుచునుండ ♦ నవ్విషయంబున
నకృతబుద్ధిచేత ♦ నాత్మ కేవ
లంబు గర్తగాఁ ద ♦ లంచెడు దుర్మతి
కాన లేనివాఁడు ♦ గద కిరీటి! 15

గీ॥ ఎవఁ డహంకారభావంబు ♦ నెనయుఁ డెవని
బుద్ధి లిగులంబు వడదో యా ♦ పురుషుఁ డీ జ
నములఁ జంపియుఁ దన్నాశ ♦ నము నొనర్పు
వాఁడు నుం గాఁడు బద్ధుఁడుం ♦ గాఁడు పార్థ! 16

గీ॥ కర్మవిధి మూఁడువిధములు ♦ గలది యగును
జ్ఞానమును జ్ఞేయమును బరి ♦ జ్ఞాతయు నని
కరణమని కర్మమనియును ♦ గర యు నని
కర్మసంగ్రహమును మూఁడు ♦ గతులఁ దనరు. 17

క॥ గుణసంఖ్యానమునందున్
గుణభేదముచేఁ ద్రివిధమ ♦ గున్ జ్ఞానము నా
గణుతింపఁ గర్మ మనఁగా
గుణమణి కర్తయన వినఁ ద ♦ గున్ దగురీతిన్. 18

గీ॥ క్షమ విభక్తసమస్తభూ ♦ తములయందు
నలరు నవిభక్త మవ్యయ ♦ మైన యేక
భావమును దేనిచేఁ జూడఁ ♦ బడును యట్టి
దానినే యందు సాత్త్విక ♦ జ్ఞానమంచు. 19

గీ॥ భూతములయందు వేర్వేరఁ ♦ బొలుచునట్టి
భిన్నభావములెల్లను ♦ వివిధములుగ
నున్నవంచు నెఱుంగుచు ♦ నున్నయట్టి
జ్ఞానము నెఱుంగు రాజస ♦ జ్ఞానమంచు. 20

క॥ ఒకకార్యమందు నెలకొని
సకలవిషయమందువలె నె ♦ సఁగు జ్ఞాన మహే
తుక మల్పమై యథార్థము
నకు దవ్వై తామసం బ ♦ నంజనుఁ బార్థా! 21

గీ॥ నియతమై సంగరహితమై ♦ నెగడుచుండి
రాగరహితంబుగను ద్వేష ♦ రహితముగను
ధర ఫలాపేక్షలేని యు ♦ త్తముని చేత
సలుపఁబడు కర్మ మెన్నఁగా ♦ సాత్త్వికంబు. 22

క॥ వెలయఁ బ్రవృత్తి నివృత్తులు
వల కార్యాకార్యములు భ ♦ యాభయములు నా
వల బంధముక్తు లెఱుఁగం
గలిగిన యాబుద్ధి సాత్త్వి ♦ కం బనఁ బరఁగున్. 29

గీ॥ ధర్మమన నెట్టి దగును? య ♦ ధర్మ మెదియొ?
కార్యమన నెట్టి దగును? య ♦ కార్య మెదియొ?
వాని యాథార్థ్య మెఱుఁగంగ ♦ లేనిబుద్ధి
రాజసంబని యిద్ధరఁ ♦ దేజరిల్లు. 30

క॥ తమ మావరింపఁగ నధ
ర్మము ధర్మముగాఁగ నిటు స ♦ మస్తార్థము లు
ల్లమున విరుద్ధముగ నజ
స్రముఁ దలఁచెడు బుద్ధి తామ ♦ సం బనఁ బరఁగున్. 31

క॥ తలఁప మనఃప్రాణేంద్రియ
ముల వ్యాపారముల యోగ ♦ మును గూడిన ని
శ్చలధృతితో నిలిపినచో
నిల సాత్త్వికధైర్యమనుచు ♦ నెంతురు దానిన్. 32

క॥ ఫలముల నాకాంక్షించుచుఁ
బొలిచిన ధర్మార్థకామ ♦ ములఁ దగులమునన్
దలఁపున నిలిపెడు ధృతి కే
వలరాజసధైర్యమనఁ బ్ర ♦ వర్తిలుఁ బార్థా! 33

క॥ నిద్దుర భయమును శోకముఁ
దద్దయును విషాదమును మ ♦ దమ్మను విడునం
దద్దుర్మతి తద్ధైర్యముఁ
దద్దలు తామస మటంచుఁ ♦ దెరొందు రిలన్. 34

క॥ మూఁడు తెఱంగులుగాఁ గాని
యాడంగగు సౌఖ్యమందు ♦ నభ్యాసమునం
గ్రీడింప దుఃఖనాశము
గూడ లభించెడును వినుము ♦ కుంతీతనయా! 35

గీ॥ ఆదియందు విషప్రాయ ♦ మై తనర్చి
తుదకు నమృతోపమానమై ♦ తోఁచునట్టి
యాత్మబుద్ధిప్రసాదజం ♦ బైనసుఖము
సాత్త్వికంబన రాజిల్లు ♦ సవ్యసాచి! 36

గీ॥ ఉర్వి విషయేంద్రియముల సం ♦ యోగగరిమ
మొదట నమృతోపమానమై ♦ తుదకుఁ జూడఁ
గా విషప్రాయమైన సౌ ♦ ఖ్యంబు రాజ
సంబని నుతింతు రెపుడు వా ♦ సవకుమార! 37

గీ॥ ఆత్మమోహనమగుచు నా ♦ ద్యంతములను
నిద్రయుఁ బ్రమాదమును జాగు ♦ నెఱపునట్టి
సౌఖ్యమును వాడుదురు తామ ♦ సం బనంగ
నార్యవర్యులు భరతవం ♦ శాగ్రగణ్య! 38

గీ॥ ప్రకృతిజంబు లగుచుఁ ♦ బరఁగుచుండెడి నీ త్రి
విధగుణములవలన ♦ విడువఁబడిన
సత్త్వ మిద్ధరిత్రి ♦ స్వర్గలోకమునందు
దివిజులందు నెందుఁ ♦ దెలియఁబడదు. 39

గీ॥ బ్రాహ్మణక్షత్రియులకును ♦ వైశ్యులకును
బాదజులకు స్వభావసం ♦ భవములైన
యలగుణంబులచేఁ గర్మ ♦ ములును గూడ
విభజన మొనర్పఁబడియెను ♦ వేఱువేఱ. 40

కం॥ శమమును దమమును శౌచము
క్షమయును దప మార్జవంబు ♦ జ్ఞానం బాస్తి
క్యము విజ్ఞానమునుం గ
ర్మము లగును స్వభావజములు ♦ బ్రాహ్మణతతికిన్. 41

గీ॥ శౌర్యమును తేజమును ధైర్య ♦ సంపదయును
దాక్ష్య మీశ్వరభావంబు ♦ దానగుణము
సమరమునఁ బాఱిపోకుంట ♦ క్షత్రియులకు
నగు స్వభావజకర్మంబు ♦ లనఘచరిత! 42

గీ॥ వైశ్యులకును గృషియు ♦ వాణిజ్య గోరక్ష
ణలు స్వభావజమ్ము ♦ ము లగు కర్మ
ములు స్వభావజన్య ♦ ముగఁ బరిచర్యయు
శూద్రకర్మ మండ్రు ♦ సూరిజనులు. 43

కం॥ మనుజులు స్వకర్మములయం
దనురక్తిం దవిలి సిద్ధి ♦ నందెదరు సుమీ
వినుమీ స్వకర్మనిరతుల
కనవరతము సిద్ధి కలుగు ♦ నట్టి క్రియంబున్. 44

కం॥ భూతప్రవృత్తి యెవ్వని
చేతం దగ వ్యాప్తమని ♦ చే నీసర్వం
బాతని నెపుడు స్వకర్మము
చేతం బూజించి నరుఁడు ♦ సిద్ధిని బడయుఁ గా. 45

గీ॥ తనదు ధర్మ మెంత ♦ గానము తక్కువదైన
బాగుగా నొనర్పఁ ♦ బడినఁ బరుల

ధర్మమునకు మేలు ♦ తన కులకర్మముల్
సలుపువాఁడు కిల్బి ♦ షములఁ గనఁడు. 46

గీ॥ సహజమగుకర్మములు దోష ♦ సహితములని
విడువఁగా రాదు గద ధూమ ♦ వితతిచేత
నావరింపఁగఁబడినట్టి ♦ యగ్నివోలె
సర్వకర్మంబు లిల దోష ♦ సంయుతములె. 47

గీ॥ సర్వకర్మంబులందు న ♦ సక్తబుద్ధి
నిర్జితాంతఃకరణమును ♦ నిస్పృహత్వ
గరిమఁ గనువాఁడు పరమనై ♦ ష్కర్మ్యసిద్ధిఁ
బొందుచున్నాఁడు సన్న్యాస ♦ మునఁ గిరీటి! 48

గీ॥ వినుముఁ నైష్కర్మ్యసిద్ధిని ♦ గసిన వెనుక
బురుషవర్యుండు బ్రహ్మంబుఁ ♦ బొందునట్టి
యుత్తమజ్ఞాననిష్ఠ నీ ♦ వొప్పమీఱఁ
దెలియఁదగు సంగ్రహముగ నా ♦ వలనఁ బార్థ! 49

సీ॥ పరిశుద్ధమగుబుద్ధి ♦ ప్రబలంగ ధృతిమీఱ
నాత్మ నెంతయును వ ♦ శ్యముగఁ జేసి
శబ్దాదివిషయసం ♦ చయమును వర్జించి
ద్వేషరాగములను ♦ వెస విదల్చి
యేకాంతమున వసి ♦ యించి లఘ్వాశియై
యతవాఙ్మనఃకాయ ♦ గతి దనర్చి
యనిశంబు ధ్యానయో ♦ గాసక్తుఁడై మించి
వైరాగ్యవృత్తి ను ♦ పాశ్రయించి

గీ॥ కామమును గ్రోధమును బరి ♦ గ్రహము బలము
దర్పము నహంకృతియు లేక ♦ తనరుచుండి
నిర్మమత్వము శాంతి సం ♦ ధించునతఁడు
బ్రహ్మభావంబు నొందంగఁ ♦ బాత్రుఁ డగును. 50

గీ॥ సర్వభూతసముండు ప్ర ♦ సన్నహృదయుఁ
డైన యాబ్రహ్మభూతుఁ డే ♦ ద్దానికైన
దుఃఖ మందక కాంక్షయుఁ ♦ దోఁపనీక
మత్పరమభక్తి నొందు సు ♦ మ్మా కిరీటి! 51

గీ॥ ఎంతవాఁడనో మ ♦ రెవ్వాఁడనో యథా
ర్థముగ భక్తి నెఱుఁగఁ ♦ దగును నన్ను
నీ యథార్థ మెల్ల ♦ నెఱిఁగినపిమ్మట
నన్నుఁ బొందఁగలఁడు ♦ నరుఁడు పార్థ! 52

గీ॥ మద్వ్యపాశ్రయుఁడగుచుఁ గ ♦ ర్మముల నెల్ల
నాచరించుచు మదనుగ్ర ♦ హంబువలన
నవ్యయంబును శాశ్వత ♦ మగు పదంబుఁ
బొందుచున్నాఁడు నిశ్చయం ♦ బుగఁ గిరీటి! 53

గీ॥ మత్పరుఁడవై సమస్తక ♦ ర్మముల మనసు
చేత నాయందు నిలిపి వి ♦ శేషమైన
బుద్ధియోగంబు నాశ్రయిం ♦ పుచు నిరంత
రంబు మచ్చిత్తుఁడవు గమ్ము ♦ రహి దలిర్ప. 54

క॥ విను మచ్చిత్తుఁడవై నా
యనుగ్రహముచేఁ దరింతు ♦ వెల దుర్గము లె

ల్ల నహంకారమువలనన్
వినకుండినఁ జెడెద వీవు ♦ విమలవిచారా! 55

గీ॥ కదన మొనరింప నని యహం ♦ కార మూని
నిశ్చయించితివేని నీ ♦ నిశ్చయంబు
వ్యర్థమగు నెల్ల తెల్లంబు ♦ ప్రకృతి నిన్నుఁ
గడఁకమీఱ నియోగింపఁ ♦ గలదు గాన. 56

గీ॥ మహి స్వభావోద్భవస్వక ♦ ర్మమున బద్ధుఁ
డగుట నీ వాచరింపఁ గా ♦ నాస్థ లేని
యట్టి కర్మంబు లొనరింతు ♦ వవశముగను
మోహమునఁ జేసి దళితచ ♦ మూసమూహ! 57

గీ॥ యంత్రమందు నధిష్ఠించి ♦ నట్టి ప్రాణి
సంచయంబుల నాడించు ♦ చందముగను
మాయచే నడిపించు స ♦ మస్తభూత
హృదయసీమల నెలకొని ♦ యీశ్వరుండు. 58

గీ॥ వాసవతనూజ! సర్వభా ♦ వములచేత
నమ్మహాత్ముని శరణంబు ♦ నందుమయ్య
శాశ్వతస్థానమును దత్ప్ర ♦ సాదమహిమ
నుత్తమం బగు శాంతిని ♦ నొందఁ గలవు. 59

క॥ ధరణి రహస్యంబులలోఁ
బరమరహస్యమగు జ్ఞాన ♦ భాగము నీకుం
గరుణించితి నది సర్వము
బరిసి యున్నే [illegible] ♦ మాయ్య! [illegible]! 60

గీ॥ సర్వగుహ్యతమము • సర్వోత్తమం బగు
నాదు పలుకు వినుము • నాకు నీవు
పరమహితుఁడ వగుటఁ • బరమహితంబు నేఁ
దెలుచుఁ జెప్పవలసె • ధన్యచరిత! 61

గీ॥ నన్నె మదిని నిల్పి • నాకు భక్తుండవై
నను భజించి నాకు • నతు లొనర్చు
నాకుఁ బ్రియుఁడ వైతి • నన్నుఁ బొందెద వీవు
సత్యముగఁ బ్రతిజ్ఞ • సలుపువాఁడ. 62

క॥ నన్నె శరణందు ధర్మము
లన్నియును బరిత్యజించి • యఖిలాఘములన్
నిన్ను విముక్తుని జేయుచు
నున్నాఁడను నేను శోక • మొందకు మింకన్. 63

గీ॥ నీకుఁ జెప్పినయవి సెప్పఁ • బోకు మెపుడు
తప మొనర్పనివాని కు • దారభక్తి
లేనివానికి శుశ్రూష • లేనివాని
కభ్యసూయ నాపైఁ గల • యాతనికిని. 64

క॥ ఈ పరమగుహ్యమైనది
నాపైఁ గనుభక్తిఁ జేసి • నాభక్తులకున్
దాపక యుపదేశించెను
నా పురుషుఁడు సెందు నన్ను • హతసంశయుఁడై. 65

క॥ మనుజులలో నాతనిక
న్నను బ్రియకృత్తముఁడు లేఁడు • నాకు నొకఁడా

తనికన్నఁ బ్రియతరుంకున్
గనుపట్టట దుర్ఘటంబు • గద కౌంతేయా! 66

క॥ విను ధర్మము తప్పని యీ
మనసంవాదంబుఁ జదువు • మహనీయుఁడు న
న్ననయంబు జ్ఞానయజ్ఞం
బున నారాధించినట్లు • ముదితుఁడ నగుదున్. 67

గీ॥ శ్రద్ధ కలిగి యసూయ దూ • రముగఁ జిమ్మి
దీని వినువాఁడు ముక్తుఁడై • తేజరిల్లి
పుణ్యకర్మము లొనరించు • పురుషవరుల
యుత్తమంబగు లోకంబు • నొందుచుండు. 68

క॥ ఓయి ధనంజయ! వింటివి
గా యేకాగ్రమగు చిత్త • గరిమను దీనిన్
నీయజ్ఞానజమోహము
పోయెనుగా యనినఁ బాండు • పుత్రుఁడు వలికెన్. 69

క॥ స్మృతి లబ్ధమయ్యె మోహము
గతమయ్యెను సంశయములు • కడ తేరెను నీ
యతికరుణ నింక నీ యా
నతిచొప్పున నడఁచువాఁడ • నారాయణుఁడా! 70

గీ॥ అట్టు లద్భుతముగ రోమ • హర్షణముగ
సమ్మహాత్ములు వాసుదే • వార్జునులకు
నైన సంవాదమును వింటి • నంచు సంజ
యుండు ధృతరాష్ట్రునకుఁ జెప్పె • నుల్ల మలర. 71

గీ॥ పరమగుహ్య మగుచుఁ • బరగు నీయోగంబు
యోగివరుఁడు కృష్ణుఁ • డూర్జితముగ
స్వయముగా వచింపఁ • బ్రత్యక్షముగ వింటి
బాదరాయణపు • సాదమహిమ. 72

గీ॥ వాసుదేవ కిరీటి సం • వాదమగుచు
నద్భుతావహ మతిపుణ్య • మయిన దీనిఁ
దలఁచి తలఁచి మహానంద • జలధిలోన
నోలలాడుదు సారెకు • నో నృపాల! 73

క॥ పరమాద్భుతమగు నా శ్రీ
హరిరూపముఁ దలఁచి తలఁచి • యతివిస్మయసం
భరితుండ నగుచుఁ గాంతుం
బరమానందంబు మాటి • మాటికి దేవా! 74

ఉ॥ ఎచ్చట యోగిశేఖరుఁడు • కృష్ణుఁడు దివ్యధనుర్ధరుండు వి
వ్వచ్చుఁడు ఫల్గునుండు ప్రతి•భాయుతులై తనరారుచుందురో
యచ్చట శ్రీవిభూతివిజ • యంబులు నీతివిశేష మెంతయున్
నిచ్చలు గల్గుచుండుటలు • నిశ్చయమంచుఁ దలంచెద న్మదిన్..

ఇది శ్రీ మహాభారతమునందు భీష్మపర్వంబున శ్రీ బ్రహ్మ విద్యాయోగశాస్త్రంబును శ్రీకృష్ణార్జునసంవాదంబును నగు శ్రీ భగవద్గీతోపనిషదంబున మోక్షసన్న్యాసయోగ మను అష్టాదశాధ్యాయము. 649

# శ్రీ మద్భగవద్గీతామాహాత్మ్యము.



క॥ ప్రారబ్ధ మనుభవించెడు
వారికి నీయందుఁ బరమ ♦ భక్తి యెటులు పెం
పారెడు దేవా! యనియెడు
ధారణితో వెన్నుఁడనియెఁ ♦ దద్దయుఁ బ్రీతిన్. 1

క॥ ప్రారబ్ధ మనుభవించెడు
వారైనను గీత లక్ష్మిఁ ♦ బఠియింపంగా
వారక కాంతురు మోక్ష మ
పారసుఖము విగతకర్మ ♦ బంధను లగుచున్. 2

క॥ గీతాభ్యాస మొనర్చెడు
పూతచరిత్రులను బాప ♦ ములె కాదు మహా
పాతకములైన నంటవు
ఖ్యాతిగ సలిలములు దామ ♦ రాకుం బోలెన్. 3

క॥ గీతాపుస్తకరత్నం
బే తావున నుండుఁ బఠన ♦ మెచటఁ జరుగునో
యా తావు ప్రయాగాదిమ
హాతీర్థస్థలసమాన ♦ మండురు విబుధుల్. 4

సీ॥ సర్వదేవతలును ఋషీ ♦ శ్వరులు యోగు
లురగులును గోపగోపికో ♦ త్కరము నార
దుండు నుద్ధవుఁడును బార్ష ♦ దులు సహాయ్యు
లవుదు రెట గీతలఁ బఠింతు ♦ రచట నెపుడు. 5

ఎచ్చట గీతాపఠనము
ముచ్చటగాఁ దద్విచార • మును జరిగెడునో
యెచ్చట నది విన నగునో
యచ్చట నే నుండుదును గ • దా భూదేవీ! 6

క॥ గీతలు నాకాశ్రయములు
గీతలు మద్వాసయోగ్య • కేళీగృహముల్
గీతాశాస్త్రజ్ఞానము
చేత జగత్త్రయము సంత • సిలి పాలింతున్. 7

గీ॥ బ్రహ్మరూప మనిర్వాచ్య • పదమయంబు
నర్ధమాత్రాక్షరంబు ని • త్యంబు నగుచుఁ
బరఁగు గీతలు చూవె మ • త్పరమవిద్య
సత్య మిదియని నమ్ము ని • స్సంశయముగ. 8

గీ॥ ఆగమత్రయముల • కానందమునకు ని
ధానమగుచుఁ బరమ • తత్త్వ మయిన
దీని నర్జునునకుఁ • దెలిపెఁ గృష్ణుఁడు చిదా
నందుఁ డయిన నంద • నందనుండు. 9

క॥ పదునెనిమిదియధ్యాయము
లెద నిశ్చలభక్తియుక్తి • నెతఁ డనుదినమున్
చదువును బ్రహ్మజ్ఞానము
పొడ వెడు నాతనికి మోక్ష • మును బొంద నగున్. 10

సంపూర్ణముగా దీనిఁ బ
ఠింపఁగ నసమర్థుఁడై ప • ఠించుఁ దదర్థం
బింపుగ నెతఁ డతనికి నగుఁ
బెంపున గోదానఫలము • ప్రీతి దలిర్పన్. 11

క॥ మూడవభాగముఁ జదివిన
వాఁ డారనవంతుఁ జదువు ♦ వాఁడయినఁ గనం
గూడును గంగాస్నానం
బాడినసత్ఫలము సోమ ♦ యాగఫలంబున్. 12

గీ॥ భక్తియుక్తి మీఱఁ ♦ బ్రతిదినం బేకసర్గ
మును బఠించునట్టి ♦ పుణ్యపురుషుఁ
డల్ల రుద్రలోక ♦ మందు సంతసమునఁ
బ్రమథగణములందుఁ ♦ బ్రబలుచుండు. 13

క॥ అనుదిన మధ్యాయములో
నను నాల్గవభాగమును నె ♦ నర్చఁ బఠన మా
ఘనుఁడు మనుకాలమంతయు
మను మనుజత్వమును గాంచి ♦ మహి మహిమమునన్. 14

ఉ॥ గీతలలోని శ్లోకము లో ♦ గిం బదినేను నైదు నాల్గుమూ
డాతతరీతి రెండు నొకఁ ♦ డందు సగంబయినం బఠించు వి
ఖ్యాతుఁడు వర్తిలుం బది సహస్రము లేఁడులు చంద్రలోకమం
దాతఁడు గీతలంజదువు ♦ చందము నొంద నమర్త్యతం గనున్.

క॥ గీతాభ్యాస మొనర్చుట
చేతం బురుషునికి ముక్తి ♦ సిద్ధించుఁజుమీ
గీతాస్మరణముఁ జేయుచు
నీతనువును విడుచు పుణ్యుఁ ♦ డెనయును సుగతిన్. 16

క॥ గీతార్థము లాలించెడు
పూతచరిత్రుండు పాప ♦ ములఁ బాసి రమా
నేతృసమక్షమునందున్
బ్రీతిగ హర్షమునఁ దేలు ♦ వైకుంఠపురిన్. 17

క॥ ఏవాఁడు నిత్యకర్మము
లేవేళం జేసి గీత • లెంతయును ప్రియం
బావహిలఁ జదువు నాతఁడె
జీవన్ముక్తుఁడయి ముక్తిఁ • జెందును దుదకున్. 18

క॥ జనకాదులైన భూభుజు
లనేకు లీగీతల నెక • దా గొలిచి సదా
వినిర్తితకల్మషులై
ఘనులై తనరారి ముక్తిఁ • గాంచిరి తుదకున్. 19

క॥ విను గీతామాహాత్మ్య
మ్మును విడిచి తదీయపఠన • మును జేసిన యా
మనుజుఁడు గన నేరఁడు ఫల
మును నణుమాత్రముఁ బ్రయాస • ముం దక్కంగన్. 20

క॥ ఏతన్మాహాత్మ్యముతో
గీతాపారాయణంబుఁ • గిల్బిషరహిత
స్ఫీతమతిం గావించెడు
పూతచరిత్రుండు మోక్ష • మును బొందుఁ దుదన్. 21

క॥ తనచేఁ జెప్పఁబడిన పా
క్తన మీ మాహాత్మ్యమును స • దా గీతల వె
న్కను జదువ నుక్తఫలముల
నెనయును మనుజుఁ డని సూతుఁ • డిట్లని చెప్పెన్. 23

క॥ నిగమాంతార్థప్రవణా!
జగదుద్భవభరణకరణ • సంహరణచణా!
త్రిగుణాతీత! బ్రహ్మ

మ॥ గణనాతీతఘృణాగుణాభరణ! లో • కవ్రాతరక్షావిచ
క్షణ! దాక్షిణ్యకటాక్షవీక్షణ! జగ • త్కల్యాణసంధానకా
రణ! సృష్టిస్థితినాశన! ప్రచురకా • ర్యస్వైర సంచారణా!
ప్రణవప్రాణధురీణ! పాలనకళా • పారీణ! నారాయణా! 24

మాలినీ॥ చిరతరగుణధామా! • శ్రీవిలాసాభిరామా!
నిరుపమశుభమూర్తీ! • నిస్తులస్వచ్ఛకీర్తీ!
దురితదళనశూరా! • స్తోత్రపాత్రప్రచారా!
పరమమునిశరణ్యా! • పాలితాగణ్యపుణ్యా!

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర శాండిల్యగోత్రపవిత్ర రామయోగీంద్రపౌత్త్ర సుందరరామయామాత్యపుత్త్ర సన్న్యాసిరాజాంధ్రీకృత శ్రీభగవద్గీతాయోగశాస్త్రమును దన్మాహాత్మ్యమును

సంపూర్ణము.



చ॥ అభినవకృష్ణరాయలని • యాంధ్రులు మెచ్చఁగఁ బీఠికాపురిం
బ్రభగను రావు వేంకటకు • మారమహీపతి సూర్యరాయరా
ట్ప్రభులును వారిమంత్రులయి•ప్రస్తుతిఁ గాంచిన మొక్కపాటివం
శభవులు సుబ్బరాయబుధ • సత్తము లీకృతిఁ దన్పి రచ్చునన్.

PRINTED AT THE S. S. M. PRESS, VIZAG.

